# సర్దార్ పాపన్న

తెలుగు విశ్వవిద్యాలయం నిర్వహించిన
సాంప్రదాయిక పద్యసహిత చారిత్రిక నాటకరచన పోటీలో
నెగ్గి
ఉత్తమ బహుమతి క్రింద
అయిదు వేలరూపాయల నగదు పారితోషిక మందుకొన్న
గ్రంథము



రచయిత :
భాషా ప్రవీణ పంపన సూర్యనారాయణ
ఎం. ఏ., ఎం. ఫిల్
ఆంధ్రోపన్యాసకుడు :
మహారాజా కళాశాల - పెద్దాపురం
తూ॥ గో॥ జిల్లా. (ఆ. ప్ర.)

ప్రథమ ముద్రణ 1989

ప్రతులు 1000

హక్కులు
గ్రంథకర్తవి

వెల : రు. 15-00

ప్రతులకు
పంపన లక్ష్మి
శ్రీపాదవారి గృహము
ప్రభుత్వ ఆసుపత్రి వెనుకవీధి
పెద్దాపురం - 533 437
తూ॥ గో॥ జిల్లా.

ముద్రణ
కిరణ్ ప్రింటింగ్ వర్క్స్
పెద్దాపురం

# అంకితము



అందరి తల్లిదండ్రులు మహాత్ములు, నా తలిదండ్రులందు మి
న్నందిన యట్టి దిట్టలు, నిరక్షరకుక్షులు, పట్టుబట్టి న
న్నుందమ నోళ్ళు కట్టుకొని నోదకులై చదివించినారు, చె
ప్పందరమౌనె అమ్మపడు పాటుల, ఆ ఋణ మింత తీరునే!

# తొలి పలుకు

తాగి రేకుల్లో, రాతి పలకల్లో జానపద గాథల్లో దాగియున్న తెలుగునాటి తొలినాటి చరిత్రను వెతికి, వెలికి తీసి వ్యాస రూపమున సూటిగా, నీటుగా ఆంధ్రుల కందించిన మహానుభావులు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు. కాల గర్భపు పొరల్లో మరుగు పడి పోయిన జానపద సాహిత్యము లోని వీర రస స్ఫోరకమైన ఒక వీరుని జీవిత గాథను గైకొని చరిత్రాంశములతో సమన్వయించి వారు వ్రాసిన వ్యాసమీ నాటకమునకు మూలమైన ముడి పదార్థము.

శర్మగారని నట్లు ఈ జానపద గాథ లోని వ్యక్తి అతి సామాన్యమైన గీత వృత్తి కుటుంబమున పుట్టి, గొడ్లను గాచి, ఉన్నత లక్ష్య ప్రేరితుడయి, శౌర్య సాహసములను వెలయించి, దుర్గాధి పతియై, సంకల్ప సిద్ధిని పొంది తుదకు దైవ దుర్విపాకమున దుర్మరణము పాలైన సర్వాయి పాపడు. ఇతడు పా. వెం. రాజ మన్నారు గారు వక్కాణించినట్లు గోల్కొండ నవాబునే కొంది శిక్షుణ్ణి చెయ్య గలిగిన తెలుగు వీరుడు.

ఈ నాటకము చాల వరకు జానపద గాథాను గుణముగా నడిపించుట జరిగినది. అట్లని వాస్తవ విరుద్ధాంశములైన నాగు బాము పడగతో గొడుగు పట్టుట, కాశీ బ్రాహ్మణుల జోస్యము మొదలగు వాటిని యథా తథముగా గ్రహింప లేదు. వాటికి వేరే గతి కల్పించితిని. మరియు షాహపురము, తాటి కొండ గ్రామ ప్రదేశములలో దుర్గ నిర్మాణము మొదలగు చారిత్ర కాంశములను కథా శరీరమున కవయవములు గావించితిని.

కథలో తల్లిని, చరిత్రలో సోదరిని ధనము కోసమై హింసించి నట్లున్న విషయాలను నాటక నాయక పాత్ర లక్షణ యుక్తముగా తీర్చి దిద్దితిని. పాపనికి గల సర్దార్ బిరుదమును కథకు ముడి పెట్టితిని. మొత్తము మీద జాన పద గాథకు, చరిత్రకు సమన్వయము కుదిర్చితిని. చిట్ట చివరగా నాయకుని మరణము సందిగ్ధాంశములతో కూడి యుండుటచే దానిని పాఠకుల ఊహకు జార విడిచితిని.

పాత్రల నడ్డు పెట్టుకొని స్వాతంత్ర్య వైశిష్ట్యము జీవనాడిగా మద్య పానము వలన వాటిల్లు అనర్థములు వక్కాణించి, స్త్రీ శక్తి నుగ్గడించి, కుల మతాదుల భేదాల వాదాలను నిరసించి, కార్య సాఫల్య కారణమైన ఏకాగ్రతాది గుణాలను ప్రస్తుతించి, నాటకమును ఉపదేశ ప్రయోజనాత్మకముగా నడిపించితిని.

మదీయ హృదయమున బీజ ప్రాయముగా నున్న నాటక రచనాభిప్రాయమునకు నీరు పోసినది తెలుగు విశ్వ విద్యాలయము యొక్క 'ఉత్తమ గ్రంథాలకు బహుమతులు' అను ప్రకటన. కనుక విశ్వ విద్యాలయమునకు వెన్నుగా నున్న ఏతత్ సత్కార్య సంచాలకు లకు నా ధన్య వాదములు.

ఇట్లు
రచయిత

Prof : T. Donappa
M.A; Ph.D; D.Litt

G.8. Sri Sai Apartments
Irrummanzil
Hyderabad

# శుభాశయం

వర్చః ప్రాప్తి పుట్టుకతో రాదు, దీక్షా దక్షతలే కార్య వాదులకు గాని, ఖడ్గ వాదులకు గాని రక్షా భూషలు. సముత్థాన పరులైన ప్రయత్న శీలురు సాధించలేని పనులు లేవు - అన్న సూత్రత్రయా నికి సుస్థిర లక్ష్యంగా నిలిచి, అజయ్యులన్న రిపులను గెలిచి, యశో లక్ష్మితోపాటు విపుల విపులను ఏలిచిన ఏకాంగ వీరుడూ, మేరునగ ధీరుడూ అయిన సర్దార్ పాపన్న యథార్థ గాథా చిత్రణమే ఈ రూపక రచనకు ఆయువు పట్టు.

శుక్ల వర్ష సమారంభ సంరంభంలో తెలుగు విశ్వ విద్యాలయం వారు నిర్వహించిన చారిత్రిక రూపక రచనా స్పర్ధా పరీక్షలో నిలిచి, సాహిత్యాధ్వర దీక్షా పరతంత్రులైన సమీక్షకుల మెదింపులో ఉత్తమ రచనగా సిఫార్సునంది, విశ్వ విద్యాలయం వారి ఉన్నత పురస్కారం పొందిన ఉదాత్త చారిత్రిక నాటక మిది. ప్రాచీన గీర్వాణ రూపక నిర్మాణ మర్యాదలకూ, అర్వాచీన రంగ స్థల ప్రయోగ సపర్యాదులకూ ఇది ఆటపట్టు.

ఏతద్రూపక రచయిత శ్రీ పంపన సూర్యనారాయణగారు తూర్పుగోదావరి జిల్లా పెద్దాపురం పట్టణంలోని మహారాణీ కళాశాలలో ప్రాచ్య భాషోపన్యాసకులు, రచయితలుగా, రంగస్థల నటులుగా, రాణకెక్కిన ప్రయోక్తలుగా తెలుగు నాట పేరు పెంపులు సంపా దించిన వారు. విశేషించి, విద్యావినయ సనీతులు. పంపన వారు మాకు ప్రత్యక్ష శిష్యులు కారు.. అట్లని ఏకలవ్య శిష్యులూ కారు. "విద్యా సంతాన పరంపరయా శిష్యాః" అన్న కోవ వారిది. అంటే, ప్రశిష్యులు కావచ్చు. పురుషకార మహిమా ప్రకాశకమైన ఈ రూపకం అవశ్యం సమాదరణీయం.

ఏషః సమారంభో యశస్వీభవతు.

తూమాటి దోణప్ప

అభిసారిక
సంసార సమస్యల మాస పత్రిక
సామర్లకోట

ఎడిటర్స్
రాంషా
పూషా

# నాంది

మంచి నాటకం వ్రాయటానికి నటనానుభవం ఉండాలి. నాటక లక్షణాలు తెలియాలి. తెలిసినవి ప్రయోగించటంలో సౌష్ఠవం కలగాలి. పద్య రచనా సామర్థ్యము. సంభాషణా చమత్కారము. తాత్త్విక దృక్కు ఉండాలి. లోక వేద్యత ఉండాలి.

సంభాషణలు పాత్రోచితంగా ఉండాలి. సందర్భ శుద్ధి ఉండాలి. జాతీయాలు జాలు వారాలి. సాహిత్యపు విలువ చెడకూడదు.

యిన్ని వున్నా చరిత్రకు చెందిన నాటకం వ్రాయటం మరీ కష్టం. కాల చక్రాన్ని వెనక్కి త్రిప్పి పూర్వాపరాలను పరిశీలించి. గత వైభవాన్ని. నాటి ప్రజల మనోభావాల్ని పునః సృష్టిచేయాలి. అంత పని చేసినవాడు రచయిత

కాలానికి ఎదురీత ఈ రచయితది. అందుచే చారిత్రిక సత్యాలను శోధించి సాధించ గలిగాడు. నాటక రంగం అస్తమిస్తున్న ఈ కాలంలో గొంతు విప్పి పద్యాన్నయినా చక్కగా విరిచి సహృదయులకు అందివ్వటం ఎరుగని వచన నటులు విలసిల్లిన ఈ రోజులలో సర్దార్ పాపన్నను పునః ప్రతిష్ఠించి కొత్త వెలుగును ప్రసాదించటం సామాన్య విషయం కాదు.

అందుకే తెలుగు విశ్వవిద్యాలయ పీఠాధిపతులు ఈ రచనను పరిగణించారు. రచయితను సత్కరించారు. ఇది గొప్ప విషయం.

ఇతర విశ్వ విద్యాలయాధి పతులు ఈ గ్రంథాన్ని పాఠ్య గ్రంథంగా ప్రవేశపెట్టి తెలుగు వెలుగును వెదజల్లెదరు గాక!

ప్రయోగ యోగ్యమయిన ఈ నాటకాన్ని రంగ స్థలంపై ప్రవేశపెట్టి ఆంధ్ర నాటక రంగం తన చరిత్రలో నూతనాధ్యాయాన్ని సృష్టించు కోవాలని కోరుతున్నాను.

సామర్లకోట
3-10-89

రాంషా

# భూమిక

— ఘట్టమరాజు

ఈ నవలాయుగంలో నాటకాలు వెలువడటం అరుదు. అందు లోనూ చారిత్రక నాటకాలు వెలువడటం మరీ అరుదు. శ్రీ సూర్య నారాయణగారి నాటకం "సర్దార్ పాపన్న" ఈ నేపథ్యంలో అపు రూపమయినదిగా నిలుస్తుంది. సర్వాయి పాపడు తెలంగాణాకు చెందిన వీరుడు. జానపద గేయాల్లోనూ, కథా గేయాల్లోనూ నేటకీ అమరుడై నిలచివున్న ధరోదాత్తుడు సర్దార్ పాపన్న. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు పాపన్న చరిత్ర త్రవ్వి తీసినా, ఇంకా ఎన్నో అమూల్యమైన శకలాలు చరిత్ర గర్భంలో దాగి వున్నాయి.

శ్రీ సూర్యనారాయణ లబ్ధమైన చారిత్రాంశాలకు మనోహర మైన, సహజమైన కల్పనలు జోడించి "సర్దార్ పాపన్న" నాటకాన్ని రమణీయంగా, ప్రభావ స్ఫోరకంగా తీర్చి దిద్దారు. పాపన్న అతి సామాన్య కుటుంబంలో పుట్టి ఉదాత్త ఆశయాల సాధనకై అనన్య శౌర్య పరాక్రమాల ద్వారా పోరాడిన సాహస సింహుడు. కులవిద్య గీత పని ద్వారా కడుపులో చల్ల కదల కుండా బ్రతుక గలిగినా, అది ఎన్నో వేల కుటుంబాల వినాశనానికి దారి తీస్తున్నదని గ్రహించి, "కల్లు మానండోయ్, మీరూ కత్తి పట్టండోయ్" అని యువతరాన్ని మేల్కొలిపిన వీరవైతాళికుడు సర్దార్ పాపన్న.

"పౌరుషంబు తాకట్టు పెట్టి బ్రతుకలేను
ఉద్యమంబున కర్పింతు నుసురునైన"
"నా శరీర మందూపి రున్నంత వరకు
కత్తి కదలాడు కదన రంగంబు నందు"

అని సహచరులను కార్యశూరులుగా మలచిన వీరశిల్పి సర్దార్ పాపన్న.

గాంధీ యుగ లక్ష్యములను పాపన్న ద్వారా పంపన మనకు ప్రసా దించెదరు. పాపన్న చరిత్రలోని వ్యక్తి కాదు, మన కనుల ముందు నిలచి, మన కనుల ముందే రవిగా వెలుగుచున్న మహాశూరుడు. సామ్యతత్వమును ధ్వనించు ప్రస్తుత నాటకము యుగధర్మమునకు జిహ్వయై మానవతావాదమును ప్రసాదించుచున్నది. ఇట్టి కృతులు భాషామతల్లికి అలంకృతులు.

తన్మయత్వ - ఆధునిక సాహిత్యములో వికృతులు అధికముగా కనిపించును. ఈ నాటకములో వికృతులులేవు. వికృతి లేని కృతియే మేటికృతి. ప్రతి పాత్ర సహజప్రవృత్తులతో చిరపరిచిత పాత్రగా గోచరించును. పంపన తన్మయతయే ఈ సాఫల్య సిద్ధికి హేతువు. 'సర్దార్ పాపడు పేరు వింటే చాలు - సలసలా కాగి వేగంపుంజు కొంటుంది నా రక్తం' అని కలమును కత్తిగా మార్చి పాపన్న ప్రక్కలో కనిపించెదరు పంపన. కథలో మునిగి పొంగలతల్లీనత చేతనే పంపన రసగంగా ప్రవాహములను వెలయించ గలిగిరి.

భక్తి - భక్తి వాడు మహాకవి కాలేడు. మహాత్ముడు కాలేడు. మఱేమి యైనను కావచ్చును. చరిత్ర ఈ నుడికి సాక్షి. పంపన మహా భక్తులు. వారి నాటకమునకు నాయకుడైన సర్దార్ పాపన్న కూడ మహా హనుమద్ భక్తుడు. హనుమంతుని శౌర్య సాహసముల దీపాలు గుండెలో వెలిగించుకొని గుడిసె నుండి కోటల మీద కెగిరి. ధూళి నుండి మాణిక్యముగా లేచి, సింహమై గర్జించి, అన్యాయ రాక్షసుల నెదిరించి ధర్మశ్రీకై ఖడ్గశ్రీ నెత్తు పాపన్న చేయు ప్రతి కార్యములో ఆంజనేయుని శౌర్యమును కన్నులకు కట్టినట్లు. నిరూపించెదరు పంపన. నాంది దర్శనీయము —

ధూళి తెగ జిమ్మ యాడగా, దుమ్ము దులిపి
ఎత్తుకొను యశోదకు హస్త మెత్తి, కోడ
పై నెగురు చుండిన హనుమద్ధ్వజము జూపు
పాపడు సభాసదులను గాపాడుగాక!

ఈ పాపడు చక్రధారి. ఈ పాపడు ఖడ్గధారి. హనుమద్భక్తి పంపన శక్తి.

# కృతజ్ఞతలు

"నాటకాంతం హిసాహిత్యమ్" అను వాక్యము పఠన విషయమునందే గాక రచనా విషయము నందును వర్తించుననని పెద్దల మాట. కాని నాకు నాటకమే తొలి సృజనాత్మక రచన యగుట విశేషము.

నిర్ణయించిన గడువు మేరకు పూర్తిచేసి పంపించిన ఈనా "సర్దార్ పాపన్న" నాటకమునకు తెలుగు విశ్వ విద్యాలయ పక్షమున ఉత్తమ బహుమతి ప్రకటించిన న్యాయ నిర్ణేతలకు వినయ పూర్వకాభివందనములు

పద్య రచనలో అతి రథ మహారథులున్న తాలింఖానాలో నిలబడి ఏదో సామాన్యంగా పద్యం వ్రాయగల్గిన నేను సమాజ సమస్యలపై దృష్టి సారించిన సాంస్కృతిక సమాఖ్య సభ్యుల సాహచర్య సత్వ సంపన్నుడ నగుట చేతనే సాంప్రదాయిక పద్య సహిత చారిత్రిక నాటక రచన పోటీలో విజేత నయితిననుట నిజము.

ఉత్తమ నాటక బహుమతి పొందిన కారణముగా నాటక నాయకుని తోపాటు నేను కూడ గోల్కొండను జయించినట్లైనది.

అయితే సహృదయ సాహిత్యాభిమానుల ప్రశంసలకు పాత్రమైనదే ఉత్తమ గ్రంథము కాని ఉత్తమ బహుమతి పొందినంత మాత్రమున కాదని నాకు తెలియని విషయము కాదు.

ఎవరిని దృష్టిలో పెట్టుకొని ఈ నాటకమును రచించితినో వారు చైతన్య వంతులు, సంస్కార వంతులగుటయే నేనాశించిన ఫలము. నాకు వారేమి చేసితి రనునది గాక వారికి నేనేమి ఉపయోగ పడితి

ననునదియే ప్రధానమైన ఆలోచన. అది ఈ విధముగా నెరవేరినచో కృతార్థుడనైనట్లే.

రచనా సమయమున నందే ప్రత్యంకము విని తగు సూచనల నిచ్చుచు, ఉత్సాహ పరుచుచు, నాటక పరిపూర్తికి దోహదపడిన మాన్య సౌజన్యులు శ్రీమాన్ ద్వివేది సత్యకవి గారికి, పోటీకి పంపుటకు ముందే నాటకము నాద్యంతము చదివి చిన్న చిన్న పొరపాట్లను సరి దిద్దిన సహృదయ సార్వభౌములు శ్రీమాన్ అల్లం రాజు లక్ష్మీ పతి గారికి నా కృతజ్ఞతాభివందనములు.

మద్గురూణాం గురువులు, శుభాశయ సుమనస్కులు ఆచార్య తూమాటి దొణప్పగారికి, ప్రాచీనాధునాతన శాస్త్ర విషయ సమన్వయ సమర్థులు, నాందీవాక్య సువచస్కులు రాంషా గారికి, సాహిత్య సార్వ భౌములు, భూమిక ప్రసాదకులు ఘట్టమరాజు అశ్వత్థ నారాయణ గారికి అసాధారణ శేముషీ సంపన్నులు, పరమార్థ సంపాదనైక ప్రవణులు, నాటక సమీక్షకులు ఆచార్య సరగు కృష్ణమూర్తి గారికి వినయ పూర్వక నమస్కారములు.



# జోహారం

సర్దార్ పాపడు పేరు వింటే చాలు
సల సలా కాగి వేగం పుంజు కొంటుంది నా రక్తం

ప్రొద్దు పొడిస్తే చాలు
జీవితంలో బారెడు ప్రొద్దెక్కే వరకు
చేతిలో కర్ర చేలలో బర్రెలు
కొంచెం గాయుదేరితే చాలు
భగ వద్గీతలో
దేవుడు లేని తెలుగు పదం వృత్తి

అమరుల కందిందో లేదో కాని
సోమయాజులు గారు సోమిదమ్మతో
పుక్కిలించారో లేదో కాని
కాళ్ళపై నిలబడ నీయకుండా
మైకంలో తేల్చడం
జీవితం నడి ప్రొద్దుకే
మబ్బు పట్టించడం
పట్టు దొరికితే చాలు
వదల కుండా తనకు దానిసను చేసి కోవడం
దాని పాడు ప్రవృత్తి

అట్టి ప్రవృత్తి గల వృత్తిలో పుట్టి
కీత కత్తినే రణఖడ్గంగా మార్చి
రణ ఖడ్గంపు టంచుపై ప్రాణాన్ని పెట్టి

గోల్కొండ నవాబును కొంది శీకుణ్ణి చేసి
గద్దె నెక్కి
కొద్ది లోనే
దురదృష్టం వెక్కిరింపగ

మెరుపు వోలె మెరిసి పోయిన
తెలుగు వీరుడు సర్దారి పాపడు.
నేల నుండి నింగి కెగసి
కాల పటమున నిలిచిన చరిత్ర చిత్రరేఖ
కాల గర్భపు పొరల్లో కలిసి పోని
ఆ రేఖా మూల చైతన్యమే నా వారసత్వం
చరిత్ర చైతన్య చిత్ర రేఖల నభిమానించడం
నా నర నరాలలో జీర్ణించిన తత్త్వం.

రచయిత

## పాత్రములు

| పాత్ర | | వివరణ |
|---|---|---|
| పాపన్న | : | కథానాయకుడు |
| తెలగన్న<br>హనుమంతు<br>కోటయ్య<br>పైడప్ప<br>మహమ్మదాలీ<br>అలీఖాన్ | } | పాపన్న సహచర వర్గము |
| సర్వమ్మ | : | పాపన్న తల్లి |
| బంగారమ్మ | : | పాపన్న చెల్లెలు |
| వసంత | : | బంగారమ్మ ఆడు పడుచు |
| నాంచారి | : | సోదె చెప్పు ఎరుక స్త్రీ |
| జీడన్న | : | బంగారమ్మ పాలేరు |
| అమలుదారు<br>బంగారమ్మ భర్త | \| | వేదిక మీదకు రాని పాత్రలు |

# సర్దార్ పాపన్న

## ప్రథమాంకము

## నాంది

తే. గీ- ధూళి తెగజిమ్మి యాడగా, దుమ్ము దులిపి
ఎత్తుకొను యశోదకు హస్త మెత్తి, కోట
పై నెగురు చుండిన హనుమద్ధ్వజము జూపు
పాపడు సభాసదులను గాపాడు గాక!

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించును)

సూత్రధారుడు : చిత్తశుద్ధితో కూడిన ఆత్మ విశ్వాసము, సామాజిక మైన ఆలోచనా సరళి కలిగియున్న పంపన సూర్యనారాయణ రచించిన "సర్దార్ పాపన్న" నాటకమును సంస్కారవంతులైన సభ్యమహాశయుల సమక్షమున నటనా కళా పారీణులైన సహచరులతో ప్రదర్శింప బూనుట ప్రతిభా వ్యుత్పత్తి అభ్యాసము లేకత్రరాశీ భూత మగు చున్నట్లున్నది. అవును, నటి యింకను రాలేదేమి? నాటక దర్శనోత్సుకులై యున్న పారిషద మహాశయులకు అసహనము పెరుగు చున్నదే. అదిగో నటి వచ్చుచున్నది కూనరాగములు దీయుచు.

నటి : నావి కూనరాగములా!

సూత్ర : కాక, ఇంత ఆలస్యమా! అయినా, ఆడిందాటగా పాడింది పాటగా సాగుచున్నది నీకు.

నటి : స్వామీ! ఒకప్పుడు నన్ను నీ వాడినదియే ఆట, పాడిన దియే పాట యని తెగ మెచ్చుకొనిన మీరే ఇట్లనుట కాల ప్రభావమా! లేక పురుష స్వభావమా!

సూత్ర : నాటక ప్రదర్శనా లక్ష్య తత్పరుడనై తదాలస్యమునకు సహింపలేక అట్లంటిని గాని అన్యముగాదు.

నటి : అట్లనా! అయినచో ఇప్పుడు ప్రదర్శింపవలసిన నాటక విశేషము లేమి?

సూత్ర : తే. గీ– తెలుగు విశ్వ విద్యాల యోత్కృష్ట విత్త
బహుమతిం గెల్చు కొన్నట్టి పంపనార్య
లిఖిత నాటకంబిట బ్రదర్శింప వలయు
తెలుగు వీరుని పౌరుష దీప్తి మెరయ.

నటి : ఎవరా తెలుగు వీరుడు?

సూత్ర : సర్దార్ పాపన్న

నటి : అతడు చరిత్రను సృష్టించిన వీరుడు కదా!

సూత్ర : కనుకనే ఇది చారిత్రక నాటకము. దీనిని ప్రదర్శించి విజయులమైనచో మనము గోల్కొండను కొట్టినట్లే.

నటి : ఇది అంత గొప్ప కార్యమా!

సూత్ర : ఈ చారిత్రక నాటక మందలి వీరుల వీరావేశమును, అభిని వేశమును అభినయించుట సామాన్య విషయము కాదు.

నటి : అయినచో, కొడితే గోల్కొండనే కొట్టవలె నన్నట్లు సాధిం చినచో ఇటువంటి గొప్ప కార్యమునే సాధించవలె. మరి నేనిప్పుడాడవలెనా! పాడవలెనా!

సూత్ర : ఆడుటకును, పాడుటకును సమయము మించిపోయినట్లు న్నదే! అదిగో హెచ్చరిక.

(ఇరువురును నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన

శా- ఆటల్ పాటలు కట్టి పెట్టు మిక పాపన్నా! బలాధిక్యమున్
జాటంగా దగు యౌవనం బిదియు, చాల్చాల్ గోవులన్ మేపుటల్
పోటా పోటిగ చెట్టు లెక్కుటలు, నీ పోరాట హోరాటమై
కోటల్ గొట్ట గడంగు మయ్యా! కొడితే గోల్కొండ కొట్టన్వలెన్

(అరణ్యమున చెట్టుక్రింద పాపన్న తెలగన్న లిద్దరు నిద్రించు చుందురు.)

పాపన్న : (కన్నులు నులుముకుంటూ లేచి) కొడితే గోల్కొండను కొట్టవలెనా! నేను గోల్కొండను కొట్టడమా! నేనేమిటి? గోల్కొండేమిటి? కులవృత్తి చేపట్టాలని మా సర్వమ్మ తల్లి రోజూ పోరు పెడుతుంది. రేపో మాపో కల్లు గీయడం ప్రారంభించాలన్న ఆలోచనతో నున్న నేను గోల్కొండను జయించడమా! కోట నెక్కడ మంటే కోతి కొమ్మచ్చి యాడటమా లేక తాటి చెట్టెక్కడము వంటిదా! భలే విచిత్రంగా ఉన్నదే నాకు వచ్చిన కల! తాడి ఎత్తు ఎగిరి నానంటే తారా జువ్వెత్తు ఎగురు మన్నట్లుంది.

తెలగన్న : (పైకి లేస్తూ) ఏమిటి పాపన్నా! పడుకోవడం పాత గోడ లలో. కలవరింతలు కనకపు మేడలలో వలె కలవచ్చిందా! లేక కలవాట్లు పలుకుతున్నావా!

పాపన్న : తెలగన్నా! కల అంటే చాల విచిత్రమైన కల. నా చేతిలో కత్తి! ఏం కత్తి అనుకున్నావు! కల్లు గీసే కత్తి

కాదు, పటాకత్తి. అది పట్టుకొని తిప్పుతూ వెళ్ళుతుంటే నవాబు సైన్యం చెల్లా చెదరై పోయిందంటే నమ్ము.

తెలగన్న: ఆ వచ్చింది కల. అసలు, కంతి తలగడ కాదు, కల నిజం గాదు. ఆ కలేదో త్వరగా చెప్పు. ఆకలేస్తుంది.

పాపన్న : చెపుతాను విను. అలా నీతోపాటు పడుకొన్నానొ లేదో !

తెలగన్న: పడుకోగానే.

పాపన్న : నా మొఖం మీద ఎండ తీవ్రంగా పడుతుంది.

తెలగన్న: మనం చెట్టు నీడను పడుకొంటే ముఖం మీద ఎండ ఎలా పడుతుందయ్యా !

పాపన్న : (అసహనంగా) తెలగన్నా! చెట్ల ఆకుల సందుల్లో నుంచి.

తెలగన్న: అవునవును.

పాపన్న : పాము. పెద్ద నాగు పాము !

తెలగన్న: నాగు పామే! ఎక్కడ? ఎక్కడ?

పాపన్న : (కోపంతో) తెలగన్నా !

తెలగన్న: కోప్పడకు. నిజంగా పాముగాని వచ్చిందేమో అనుకొన్నాను. ఇప్పుడు చెప్పు.

పాపన్న : పెద్ద నాగు పాము వచ్చి ఎండ తగుల కుండా తన పడగనెత్తి గొడుగు పట్టింది.

తెలగన్న: గొడుగు పట్టిందంటే !

పాపన్న : అదే సమయంలో కాశీ నుంచి రామేశ్వరం వెళ్ళుచున్న బ్రాహ్మణులు ఈ వింతను చూశారు.

తెలగన్న: చూచి పారి పోలేదూ!

పాపన్న : లేదు. నాగు పామే ఆ యాత్రిక బ్రాహ్మణులను జూచి నెమ్మదిగా పొదల లోనికి వెళ్ళిపోయిందట.

తెలగన్న: తరువాత ఏం జరిగింది?

పాపన్న : ఆ బ్రాహ్మణులు దగ్గరకు వచ్చి నన్ను లేపి, అబ్బాయీ!

తే. గీ. ఇట్టి నమ్మ శక్యంబు గానట్టి ఘటన
గ్రంథముల దప్ప కనులార గాంచలేదు
కలదు నీకైన రాజయోగంబు నిజము
గొడుగు పట్టుట యేలిక గుర్తు గాదె!

అని అన్నారు.

తెలగన్న: అంటే నాగు పాము తన పడగతో పట్టిన గొడుగు రాజ లాంఛనము కాబట్టి నీకు రాజ యోగ ముందని ఆ కాశీ బ్రాహ్మణు లాశీర్వదించినారన్న మాట. అట్టి ఋషి తుల్యులైన వారి వాక్కు వ్యర్థము కాదు. తరువాత

పాపన్న : వారికి రెండు చేతులు జోడించి నమస్కరించాను. నన్ను నేటి నుండి ఆట పాటలు కట్టి పెట్టి. పశువుల మేపుట మొదలగు అల్ప కార్యములు విడనాడ మని హెచ్చరించి బయలు దేరినారు. ఆ బ్రాహ్మణులను కొంత దూరము సాగనంపుటకు వారిని వెంబడించతిని.

తెలగన్న: కలలో కూడ వారికి సముదాచారమును నెరపుట నీ వినయ విశిష్టతను వెల్లడించు చున్నది.

పాపన్న : ఆ వెంబడించు నప్పుడు వారిలో ఒకాయన మేము తిరిగి వచ్చేటప్పటికి నీవు కోటను కట్టాలంటే, మరొకాయన నీవు

కొడితే గోల్కొండనే కొట్టాలి అని నా భుజముపై చేయి వేసి నొక్కి నొక్కి చెప్పినారు. తరువాత నన్ను ఆగి పొమ్మని వారు వెళ్ళిపోయినారు. నేను పటాకత్తిని పట్టి కొని ముంజకాయ గెలల్ని నరికి నట్లు నవాబు సైనికుల శిరస్సులను నరుకు చుండగా మెలకువ వచ్చింది. నీవు ఎంతో కొంత చదువుకొన్న వాడివి కదా! దానిని ఎంత వరకు నమ్మవచ్చు నంటావో చెప్పు.

తెలగన్న: పాపన్నా! ఏ పుట్టలో ఏ పాముందో ఎవరి కెరుక? కల లోని కౌగిలికి కడుపురాదు కదా! కలలు గనడం కష్టం కాదు: కల నిజమయ్యేటట్లు కృషి చేయ్యడములోనే విశిష్టత ఉంది. కల సంగతి అలా ఉంచు. ప్రయత్నం పట్టుదల ఉండాలి కాని మానం సాధించలేని దేమిటి? ధైర్య సాహసాలతో పట్టిన పట్టు విడువ కుండా ఉంటే కొండ మీది కోతి కూడ కాళ్ళ బేరానికి వస్తుంది. అంతా ఎందుకు? కృష్ణ దేవరాయుల పూర్వ దిగ్విజయ యాత్రకు అంటే కటకం వరకు దండెత్తడానికి విజయానికి ప్రథమ సోపాన మైన ఆత్మవిశ్వాసముతో పాటు ఒక రజకుని పాటయే కదా కారణం.

పాపన్న: కృష్ణ దేవరాయులంటే మూడు పువ్వులూ, ఆరు కాయలు గా విలసిల్లిన విజయ నగరాన్ని పాలించిన ప్రభువు అని చెప్పావు: ఆయనే కదా!

తెలగన్న: అవును.

పాపన్న: అంటే కృష్ణరాయలకు తూర్పును జయించాలనే అభిని వేశము కలిగించిన వ్యక్తి ఒక్క రజకుడన్న మాట. అది ఎలాగో చెప్పు.

తెలగన్న: శ్రీ కృష్ణ దేవరాయలు మంత్రి తిమ్మరుసుతో రాత్రివేళ మారు వేషంలో సంచరించు చున్నప్పుడు ఒక నాటి వేకువ జామున

కొండవీడు మనదేరా! కొండపల్లి మనదేరా!
కాదని వాదుకు వస్తే కటకం దాక మనదేరా!
కృష్ణానది మనదేరా! గోదావరి మనదేరా!
కోరుకొండ మనదేరా! కోనసీమ మనదేరా!
కాదని వాదుకు వస్తే కటకం దాక మనదేరా!

అని రజక వతంసుడు పాడిన పాట నాలకించి ఉత్తేజితుడై పూర్వ దిగ్విజయ యాత్ర కుపక్రమించినాడట.

పాపన్న: బాగుంది, బాగుంది తెలగన్నా! ఏది ఏమైనా లేని వాడికి లేక పోయినా, ఉన్న వాడు తన సామర్థ్యాన్ని ఉపయోగించుకోలేకపోతే అంతకన్నా దౌర్భాగ్యము లేదు. అది వాడి నోమగి తనాన్ని చెప్తుంది.

తెలగన్న: అవును, మనం ఏ విద్యలో అయితే బాగుగా రాణిస్తామో అనే విషయాన్ని జీవితంలో ఎంత తొందరగా తెలిసి కొని సద్వినియోగ పరచు కుంటామో అంత గొప్ప వాళ్ళమయ్యే అవకాశముంది.

పాపన్న: తెలగన్నా! మన పైడన్న పరుగు పరుగున వస్తున్నాడు కారణమేమిటో?

తెలగన్న: ఏదైన పులి మన మందలో పడలేదు కదా!

పాపన్న: పులి వస్తే పెద్ద పులి వంటి హనుమంతు, కోటయ్యలు అక్కడ ఉన్నారు కదా!

పైడప్ప: (రొప్పుతూ) మన మంద, మన మంద . . .

తెలగన్న: మన పశువుల మంద లోనికి పులి వచ్చిందా ఏమిటి?

పాపన్న: (తెలగన్నను చేసన్నతో వారించును.)

పైడప్ప: గుర్రపు దండు వచ్చి మన మందలో లేగ దూడల్ని ఎత్తుకు పోతుంటే . . .

పాపన్న: (పళ్ళు కొరుకుతూ) ఆ కరకుకసాయి నవాబు సైన్యాన్ని . . .

తెలగన్న: ఎత్తుకొని పోతూవుంటే

పైడప్ప: లేగ దూడల్ని తమ తల్లులకు దూరం చేయవద్దని మన వాళ్ళు ఎంత బ్రతిమాలినా లక్ష్యపెట్ట లేదు సరికదా! పెనగు లాడుతున్న మన వాళ్ళపై కొరడాలు ఝళిపించి నారు. అది లెక్కచేయకుండగా హనుమంతు ఆవేశంతో దూడల్ని విడిపించుచున్నప్పుడు దయా దాక్షిణ్యాలు లేకుండగా కొరడాలతో గొడ్డును బాదినట్లు బాదుతుంటే కోటయ్య అడ్డు వెళ్ళాడు. అడ్డు వెళ్లిన కోటయ్యనొకడు తుపాకి మడమతో పొడిచి ప్రక్కకు గెంటివేసినాడు. కొంద రింతలో లేగ దూడల నాలుగు కాళ్లు కట్టి గుర్రాల మీద వేయడంతో వారందరు "అచ్చా" అనుకొని కొరడాలు ఊపుతూ వెళ్లిపోయారు. నేను మీకు చెప్పడానికి పరుగున వచ్చాను. వాళ్లు నడిచి వస్తున్నారు.

తెలగన్న: నవాబు సైన్యానికిది అలవాటయి పోయింది. అమాయకులైన ప్రజల ప్రాణాలు తోడేస్తున్నది చాలక నోరులేని పశువుల్ని కూడ హింస పెడుతున్నారు. వీళ్ల పాపం పండే

రోజు దగ్గర పడుతుంది మాంసానికి లేగదూడలు కావాలా! ఎంత పాపానికి ఒడిగట్టిన కసాయి వాళ్లయి పోయారు. లేగ దూడలని జాలి లేదే! తమ దూడలకై గోమాతలు అలమటిస్తూ అరుస్తున్న అరుపులు విని మందలో ఉండ లేక పోతున్నామే.

పైడప్ప : అరుగో! మన హనుమంతు, కోటయ్యలు వస్తున్నారు.

తెలగన్న : అయ్యో! కోటయ్య కుంటుతూ వస్తున్నాడే! అరే! హనుమంతు ఒంటినిండా రక్తం చారికలు గట్టిందే!

పాపన్న : (హనుమంతుని కౌగిలించుకొని) (గాయాలు తడిమిచూచి) వాళ్లరోజు దగ్గర పడింది. ఇలా ఎంతకాలం సాగుతుందో చూద్దాం. వాళ్ల అంతు తేల్చుకోవల్సిందే.

కోటయ్య : వాళ్ల అంతు తేల్చుకోవాలంటే కర్రకాదు త్రిప్పవలసింది కత్తి. మన వెంత సేపూ కర్ర త్రిపటంలోనే గొప్పతనం ఉందనుకుంటున్నాం.

హనుమంతు : మన పాపన్న ఎప్పుడో చెప్పాడు – మనం మొదటి నుంచి కత్తిసాము నేర్చుకోవాలని. దూడల్ని మేపుకోనే వాళ్లకి కత్తి సామెందుకని కూర్చుంటే ఇలాగ ఎప్పుడూ దెబ్బలు తినవలిసిందె

పైడప్ప : మనం నలుగురుం ఒక చోటకు చేరే లోగానే గుర్రాల మీద వచ్చిన వాళ్లు మెరుపు దాడిచేసి పనిపూర్తి చేసికొని వెళ్లి పోతున్నారు.

పాపన్న : అందుకే చెప్తున్నాను. వీళ్లని ఎదుర్కోవాలంటే మనం చేయవలసింది పశువుల మేపడం కాదు. వీళ్లకేదో అచ్చి

వున్నట్లు మనం పశువుల్ని మేపుతున్నాం. ఇక మనం చేయవలసింది, నేర్చుకోవలసింది కత్తిసాము, గురిపు స్వారీ.

హనుమంతు : పాపన్నా! నీవు చెప్పిందే మార్గం. ఇదొక ఉద్యమంగా సాగాలి. ఆ ఉద్యమాన్ని నడిపించే బాధ్యత నీది. దీనికి మార్గం చూపవలసిన వాడివి నీవే. నీట ముంచినా, పాల ముంచినా నీయిష్టం ఆ దుర్మార్గులకు జడిసి బ్రితుకు తున్నాం. ఎన్నాళ్లీ పిరికి బ్రితుకులు. మనం యోధులుగా మారాలి. సామాన్య జనాన్ని కూడ చైతన్య వంతుల్ని చేసి, ఉద్యమ కార్యకర్తలయ్యేటట్లు తీర్చి దిద్దాలి.

పైడప్ప : ఏం చెయ్యాలన్నా డబ్బు కావాలయ్యా! జుట్టు వుంటే కదా ఏ కొప్పయినా పెట్టేది, ఎన్ని జడలైనా వేసేది !

తెలగన్న: డబ్బొకటే సరిపోదు. మన పనిలో మనకు సంపూర్ణ మయిన అంకిత భావం ఉండాలి. మనసా, వాచా, కర్మణా పని చేయాలి. పోరాట పటిమ నలవర్చుకోవాలి. అవసర మయితే ప్రాణాలకైనా తెగించాలి. అప్పుడే ఏ వుద్యమ లక్ష్యమైనా నెరవేరుతుంది. ఏది ఏమైనా చెట్టుసారం పండులో వ్యక్తమౌనట్లు, గోవుసారం పాలలో తేలునట్లు, మన సారం అంతా వుద్యమ రూపంలో రావాలంటే మొట్ట మొదటగా కత్తి పట్టవలిసిందే, గురిపు స్వారీ నేర్చు కోవలిసిందే.

కోటయ్య: పట్టు పట్టరాదు, పట్టి విడువరాదు.

పాపన్న : కేవలం మనం మాత్రిమే సాధన చేస్తే సరిపోదు. పైడన్న చెప్పినట్లు డబ్బు సంపాదించి నప్పుడే సైన్యాన్ని సమ

కూర్చుకో గలం. అట్టడుగున నున్న పేద వీరులతో పాటు వివిధ వృత్తులలో నున్న పౌరుష వంతుల్ని ఒక చోటకు చేర్చి ఒకే తాడు మీద నడిపించాలి. పడుగూ పేకా కలిస్తేనే కదా గుడ్డ తయారయ్యేది. ఈ ఉద్యమానికి మా కుటుంబ సంబంధమైన తాతల నాటి పాతులన్నీ ఖర్చుపెడతాను.

హనుమంతు: అందుకే చెప్తున్నాను మన మందరం పాపన్న నాయకత్వంలో నవాబుకి బుద్ధి చెప్పగలమని.

కోటయ్య: మనం కసి తీర్చుకోవలిసింది నవాబు సైన్యము లోని దుర్మార్గులపైనే కాని నవాబు పైన కాదు కదా!

హనుమంతు: ఈ గుడ్డ ఆ తానులోదే. కనుక ఈ దుర్మార్గాలకు ఆ నవాబుకి సంబంధం లేకుండా ఉంటుందా!

కోటయ్య: అయితే నవాబుకి కూడ తగిన శాస్తి చేయవలిసిందే. కాలం కలిసివస్తే అదీ చూద్దాం. మన గమ్యం గోల్కొండ కోట కావాలి.

తెలగన్న: ఇంతవరకూ చెప్పేది ఆ సంగతే. అయితే మనం గునుపూడి జంగాలనిపించుకోకూడదు, డంబాలెప్పుడూ పూవులు పూస్తాయేగాని కాయలు కాయవు.

పైడప్ప: తెలగన్న చెప్పినట్లుగా మన ఉద్యమానికి అంకితమై నడుచుకొంటానని నేనిలా ప్రమాణం చేస్తున్నాను.

తే. గీ- నాకు పాపన్న అసలైన నాయకుండు
వాని మాట యనిక వేద వాక్కు గాగ
ఆరు మూడెనగాని మూడారుగాని
నేటి నుండియు నే జవ దాటనయ్య.

(సరేయుని వారిద్దరు వెళ్ళుచుండగా)

పాపన్న : పశువుల కంటె హీనంగా ప్రవర్తించే ఆ పరమ దుర్మార్గుల దుండగముల కారణముగా ఈ నోరు లేని సాధు జీవులకు దూరము కావలసి వచ్చుచున్నది.

తెలగన్న: (కన్నీళ్ళు పెట్టుకొనును)

హనుమంతు : (తెలగన్న కన్నీళ్లు తుడిచి) నీ ఆర్ద్రహృదయము మా కర్థమైనది. ఏ హారపొచ్చెమునకు తావులేని ఈ ప్రశాంత జీవితమునకు దూర మగుటను మించి గోమాతలపై గల మమకారము నిన్ను బాధించు చున్నది.

పాపన్న : అవును. తెలగన్నకు పశుపక్ష్యాదులపై వల్లమాలిన జాలితో కూడిన ప్రేమ. మేత మేయు చున్న గోమాతల్ని, పాలు దాగుచు మధ్య మధ్యలో గంతులు వేయుచున్న లేగ దూడల్ని చూస్తూ మైమరచి పోవు నానందమును అనుభవించుట తెలగన్న హృదయ లక్షణము. అంతే కాదు, వాటికి మేత వేసి ఇతడెంతో తృప్తిని పొందును. ఇది కవుల లక్షణమేమో!

తెలగన్న: మీరు చెప్పింది నిజము. మందలో ఆవు ఈనితే మా ఇంట్లో ఒక చంటి బిడ్డ పుట్టిన ఆనందము కలుగుతుంది. ఆ వారము రోజులు ఇంటిల్లపాదికి పండుగే కదా! వాటితో గడిపినంత సేపూ నాకు కాల ప్రపంచాల సంగతి పట్టదు. అదీ గాక "పగయు వగయును లేక ఏపాటి గన్న, అలరు సామాన్య సంసారి యగుట మేలు" అని కృష్ణరాయలన్నట్లు ఒక సామాన్యమైన రైతుగా జీవితం గడపాలనుకొన్న నేను భవిష్యత్తులో నిత్యమూ ఆందోళనకు

SUR



స్థానమైన జీవితమును చేపట్టవలసి వచ్చు చున్నదనియే నా ఆవేదన.

పాపన్న : నీవు శాస్త్రిల్లు గారింట్లో పనిజేయడం. వారి వెంట గుళ్ళో పురాణానికి వెళ్ళడం నీకు బాగా పనికివచ్చాయి! అందుకే ఇవి అన్నీ పట్టు బడ్డాయి.

హనుమంతు : రాయలవారు మంచి భలే చెప్పారే! మనిషి ఒక్కొక్క మెట్టు ఎక్కేకొద్దీ పగ, వగా పెచ్చు పెరుగుతాయి. మన మీరెండింటికి తట్టు కోవాలి.

తెలగన్న: ఇది అనుభవములో నుండి పుట్టిన మాట.

పాపన్న : మనం కత్తుల బోనులోనికి ప్రవేశించి, నేలకు బోయేది నెత్తి కెత్తికుంటున్నామని హెచ్చరిస్తుంది. ఏదో సామాన్యం గా కూడ ఈ దుర్మార్గులు బ్రతక నీయడంలేదు మనల్ని.

తెలగన్న: ఎవరో స్త్రీ ఈ అడవి మార్గము వెంట ఒంటరిగా వచ్చు చున్నది. మన తాటికొండ వెళ్లు చున్నట్లున్నది.

హనుమంతు : మంచి భలే వాడివి తెలగన్న! ఎవరను కొన్నావు! మన ఎరికల నాంచారి.

తెలగన్న: అవును. ఎరికల నాంచారే. కళ్లలోనికి నీరు రావడం కారణంగా సరిగ్గా అనలేదు. ఇటే వస్తున్ననట్లున్నది.

హనుమంతు: రానీయ్. మన పాపన్నకు ఎరుక చెప్పు మందాం. ఆమెకు ఎల్లమ్మ దేవత పూనకం ఉన్నదట కదా!

తెలగన్న: నాకిటువంటి వాటిమీద నమ్మకం లేదు.

హనుమంతు : నీ నమ్మకమలా ఉంచు. నిజమో! అబద్ధమో! ఆమె ఏమి చెపుతుందో విందాం.

నాంచారి: (గెద్ద బుట్టదింపి) బాబూ! దాహము వేస్తుంది. మంచి నీళ్లుంటే పోయరూ! లేక పోతే మీరు తెచ్చుకొనేదుంటే కొంచెం కల్లు చుక్క పోస్తే . . . . చచ్చి మీ కడుపున పుడతాను.

హనుమంతు : కల్లు లేదు, గిల్లులేదు. అన్నింటికి స్వస్తి చెప్పేశాం.

నాంచారి: అదేమిటి బాబు అలాగంటావ్!

తెలగన్న: ఆవిడకేమి తెలుస్తుందయ్యా మన సంగతి! నాంచారూ! యీ వేళ నుండి యీ పనులన్నీ మాని వేశాం.

నాంచారి: పోనీ! మంచి నీళ్ళైన . . . .

తెలగన్న: అక్కడ ఉన్నాయి. వెళ్లి త్రాగు.

నాంచారి: మిగిన్నోలు నేను ముట్టుకుంటే బాగుండదు బాబు.

తెలగన్న: ఆ చాదస్త్రాలన్నీ తుడిచి పారేశాం. మన మందర మొక్కటే. ఏం ఫరవాలేదు తాగు. అంటూ సొంటని మునం విడివిడిగా ఎవరికి వారే యమునా తీరే అన్నట్లు బ్రతక బట్టే నవాబు సైనికులు మనల్ని నానా హింసలు పెడుతున్నారు. అయినా మనకి బుద్ధి రాలేదు.

నాంచారి: (మంచి నీళ్ళు త్రాగి) మారాజులు పది కాలాల పాటు చల్లగా బ్రతకండి బాబు. మీరిక్కడ లేకపోతే దాహముతో చచ్చి పోదునేమో! ఎండ పొద్దున బయలు దేరాను. గావ కొట్టేసింది. ఇంకా తాటికొండ సుమారు రెండు కోసులు దూరం నడవాలి.

హనుమంతు : సరేకాని, మా పాపన్నకు ఎరుక చెప్పి వెళ్లు.

నాంచారి : బాబ్బాబు. పొద్దు గూకి పోతుంది. చీకటి పడితే భయం. నేను ఒక్కదాన్నే వెళ్లాలి.

హనుమంతు : మేము కూడ తాటికొండ వస్తాము నీకా భయం లేదు.

నాంచారి : సరే కాని బాబు! మీకు మా ఎరుక విషయాలు తెలియవు. ఎరుక మొదలు పెట్టిన తరువాత నా నోట్లో నుండి వచ్చిన మాట నాది కాదు. ఎల్లమ్మ తల్లిది. ఆ తల్లి మహిమ చేతనే నే చెప్పేది. అది మంచైన చెడైన మీరు కోప పడ కూడదు. శుభమైన అశుభమైన నాకు ఒక్కటే. ఇప్పుడు చెప్పండి. మీ యిష్టం.

హనుమంతు : పాపన్నా! నీ కుడిచేయి నాంచారికి చూపించు.

పాపన్న : (చేయి ఇస్తాడు)

నాంచారి :

ఎరుక ఎరుకోయమ్మ ఎరుక
ఇలవేల్పు ఎల్లమ్మ పలుకు
కాశీ విశాలాక్షి సాక్షి
కంచి కామాక్షి సాక్షి
మధుర మీనాక్షి సాక్షి
శ్రీశైల భ్రమరాంబ సాక్షి
పలుకు పలుకున ఎల్లమ్మ పలుకు
అంబ పలుకవే జగదంబ పలుకవే

(పాపని కుడిచేయి పట్టుకొని)

ఎల్లమ తల్లి మాట తప్పదు
ఆ తల్లి మాటయే నా నోట పలుకు

(కొంచెంసేపు కళ్ళు మూసికొని)

కోటల కట్టే యోగ మున్నది
కోటల నేలే భోగ మున్నది.
యోగ మంటే రాజయోగం
భోగ మంటే రాజ భోగం
మోతుబరయ్యే యోగ తన ముంది
రాజ్యము నేలే రాజస ముంది
గోల్కొండ నేలగ పంత మున్నది
ఏడు దినము లేలుట తప్పదు
ఇతని మాట కెదురే లేదు
ఇతరుల మాటకు తావే లేదు
ఎరుక ఎరుకోయమ్మ ఎరుక
ఇలవేల్పు మా ఎల్లమ్మ కెరుక

(అంటూ నాంచారి మూర్ఛ పోతుంది)

తెలగన్న: (నీళ్ళు తెచ్చి ముఖం మీద చల్లును)

నాంచారి: (లేచి ఇంకా ఎరుక చెప్పబోయి మాను కొనును)

హనుమంతు : ఆగి పోయావే!

నాంచారి: చెప్పాలను కొనే భావం చెప్పడానికి నోరు పెగలడం లేదు బాబు.

తెలగన్న: ఎందు చేత?

నాంచారి: ఏమిటో బాబు, నాకేమి తెలియడం లేదు.

హనుమంతు : ఎవరో ఇటు పరుగు పరుగున వస్తున్నారు.

తెలగన్న: (పరకాయించి చూచి) ఇంకెవరూ! జీడన్న, మన పాపన్న చెల్లెలు బంగారమ్మగారి పాలేరు.

పాపన్న : (తేరిపారి జూచి) అవును జీడన్నే! వాడిక్కడికి రావలసిన పనేమిటి?

హనుమంతు : వాడిక్కడికి రావడ మంటే బలమైన కారణ మేదో ఉండే వుంటుంది.

తెలగన్న: తగిన కారణం లేకుండా రాడే?

జీడన్న : బాబూ! పాపన్న గారూ!.......

పాపన్న : ఏరా! ఏం జరిగింది?

జీడన్న : ఏమి జరగడ మేమిటి బాబు! మీ బావగారు దుగ్గయ్య గారిని చంపేశారు బాబు

పాపన్న : మా బావ దుగ్గయ్యను చంపేశారా! ఎవర్రా!

హనుమంతు : ఎవరాౖ చంపేస్తా!

తెలగన్న: ఎవరాౖ వాళ్ళు?

జీడన్న : పొద్దుట మేమిద్దరం కలిసే పొలం వెళ్ళా మండి. ఆయన పాక దగ్గరే ఉన్నారండి. నేను క్రింద చేలల్లోకి వెళ్ళానండి. కొంత సేపటికి ఐదారుగురు గుర్రాల మీద పాక దగ్గరికి వచ్చారండి. నేను గుర్రాలను చూచి వెంటనే పాక దగ్గరికి బయలు దేరానండి. నేను వచ్చే లోపలే వాళ్ళు అయ్యగారిని పొడిచి వెళ్ళిపోయ్యారండి. పరుగు పెట్టి వెళ్ళేటప్పటికే ప్రాణాలు వదలేశారండి.

పాపన్న : ఎంత పని జరిగింది?

హనుమంతు: గుర్రాల మీద వచ్చారంటే వాళ్ళు నవాబు సైన్యంలో వాళ్ళే అయి యుంటారు.

తెలగన్న: అంత దుర్మార్గానికి ఒడిగట్టే వాళ్ళు వాళ్లే తక్కిన వాళ్ల కెవరిక్కి కావాలి అటువంటి పనులు?

పాపన్న : రోజు రోజుకి వీళ్ల ఆగడాలు పెచ్చు పెరుగుతున్నాయి!

నాంచారి: నేను వెళ్లిన ప్రతీ ఊరిలోను వీళ్ళ దుర్మార్గాల గురించే చెప్పు కుంటున్నారు బాబూ! మొన్న ఒక అమ్మాయిని కాళ్లూ చేతులూ కట్టి ఎత్తుకొని పోయారటండి. మా పిల్ల గురించి సోదె చెప్పమని ఆ తల్లీ దండ్రి అడిగితే నా గుండె తరుక్కు పోయింది. వాళ్లను చూస్తేనే కడుపు చెరువై పోయిందండి.

తెలగన్న: ఆ దుర్మార్గుల్ని ఏం చేసినా పాపం లేదు.

హనుమంతు : అసలు వాళ్ళు దుగ్గయ్యను చంప పలసిన అవసర మేమిటి?

జీడన్న : ఏమోనండి బాబు! మా యయ్యగోరి చెల్లెలుగారి గురించి ఏమిటేమిటో చెప్పు కుంటున్నారు బాబు!

తెలగన్న: అసలు వాళ్లు ఇతరుల్ని చంపడానికి కారణాలు ఉండనవ సరము లేదు.

పాపన్న : ఆ దుర్మార్గుల అంతు తేలుస్తాను.

(అందరూ నిష్క్రమింతురు)

ప్రథమాంకము సమాప్తము

—— ★ ——

# ద్వితీయాంకము

(పాపన్న ఇంటి వద్ద - తల్లి సర్వమ్మ, పాపన్న)

సర్వమ్మ : ఒరేయ్ పాపన్నా! మన పశువు లెలాగ ఉన్నాయో ఏమిటో తెలిసికొన్నావురా! వాటి ఆలనా పాలనా బొత్తిగా పరాయి వాళ్ళ మీద విడిచి పెట్టేస్తే ఎలాగరా! (ఏడుపు నణుచు కొంటూ) మీ బావ దుగ్గయ్య పోయి అప్పుడే ఇరవై రోజులయి పోయింది. ఈ ఇరవై రోజులూ దిన కార్యాలు కారణంగా నీ సావాస గాళ్లతో తిరుగు తున్న ప్పటికి నేనేమీ పట్టించు కోలేదు. ఆ పనులన్నీ అయి పోయినవి కదా! ఇప్పుడైనా బాధ్యతగా నీపని నీవు చక్కబెట్టు కోక పోతే ఎట్లాగరా!

పాపన్న : మన పశువుల ఆలనా పాలనా చూడటానికి నాకు కుదర దమ్మా!

సర్వమ్మ: పశువుల సంగతి చూడక పోతే పోనీ, మన కుల వృత్తి నైనా నేర్చుకోరా!

పాపన్న : అమ్మా! నా సంగతి తెలియక మాట్లాడు తున్నావు. నేనిటువంటి చిన్న చిన్న పనులు చేయనమ్మా!

సర్వమ్మ: మన కుల వృత్తి చిన్న పనిగా కనపడిందిరా! అంతంత చెట్టు లెక్కడ మంటే మాటలను కున్నావురా!

పాపన్న : అమ్మా! మన వృత్తిని గొప్ప వృత్తిగా చెప్పడం ఏమీ బాగుండ లేదమ్మా! తర తరాలుగా మన గొప్పతన మంతా చెట్టు లెక్కడము లోనే మంట గలిసి పోయింది. మనం తాగడం, ఇంకొకరిని తాగించడం. ఇల్లూ, ఒల్లూ

గుల్ల జేసికోవడం. ఇంతే కదా దీని పరితాపం. ఇటువంటి దాన్ని ప్రోత్సహిస్తున్నారంటే అటువంటి వారిలో ఏదో స్వార్థం గూడు కట్టుకొని ఉందని ఘంటాపథంగా చెప్ప గలను. అంతే కాదు, మన కుల వృత్తిని పట్టుకొని వ్రేలాడుతున్న వారందరిని నే నడుగుతున్న ప్రశ్న ఇది.

ఉ: ఓ కలుగీత కార్మిక సహోదరు లార! ఇదొక్క వృత్తియా!
కాకలు దేరు నట్టిదె? మగంటిమి చాటునె? వట్టి పొట్టకై
లోక జనంబులన్ సురకు లోబడు నట్లుగ జేయ నేలకో
పీకకు దాక త్రాగి మరి పేలుట దప్ప విశేష మున్నదే?

సర్వమ్మ: ఒరే పాపన్నా! నీ వెన్ని చెప్పు. పరవిద్య లెన్నియైన కుల విద్యకు సాటిరావురా!

పాపన్న: అమ్మా! నీ కెన్ని సార్లు చెప్పినప్పటికీ, కుల వృత్తి, కుల వృత్తి అని కలవరిస్తూ ఒకటే గోల పెడుతున్నావు.

ఇంటి యావుల మేపు మంటావు!
ఈత చెట్లు గీయ మంటావు!
ఈత కల్లు కట్ట మంటావు!
తాడి చెట్లు గీయ మంటావు!
తాటి బెల్లం వండ మంటావు!

సర్వమ్మ: అది కాదురా పాపన్నా! నీవు పశువుల మంద లోనికి వెళ్లక పోతే అవి ఏమయి పోతాయిరా! ఎవరి మీదనో అప్ప చెప్పితే వాళ్లకేమి కావాలిరా! యిప్పటికే కొన్ని దూడల్ని ఆ కసాయి దొంగలు పొట్టను బెట్టుకొన్నారు కదరా!

పాపన్న : అమ్మా! అందుచేతనే అంటున్నాను. నవాబు సైన్యం లోని కొందరు దొంగ చాటుగా, దౌర్జన్యంగా కూడ వచ్చి దోచుకుంటున్నారు కాబట్టే వాళ్ల ఆట కట్టించడానికి నేను కొంత సైన్యాన్ని కూర్చు కోవాలను కొంటున్నాను. అంతే కాకుండా కలిసి వస్తే కోటను కట్టాలని నా సంకల్పము.

సర్వమ్మ : మన మేమిటి? కోటలు కట్టడ మేమిటి? పగటి కలలు గాని కంటున్నావురా! కాళ్ళు కడుగు కోవడానికి ముంత లేదు కాని కల్లుకు కళాయి గిన్నె కావాలన్నాడట వెనకటి కొకడు. ఆశకు కూడ హద్దు ఉండాలిరా పాపన్న. ఏటికి ఎదు రీదుతానంటే ఎట్లారా!

పాపన్న : ఏమిటమ్మా నీవనేది?

ఈదులు గీస్తే ఉండ్రవాడు
కల్లు గట్టితే గవండ్ల వాడు
కత్తి పట్టితే మేదరవాడు
కుండ పట్టితే కుమ్మరవాడు
మొనగాడి చట్టమ్ము చ్చునా
పాళెగాడి చట్టమ్మొచ్చునా

సర్వమ్మ: పాపన్నా! అవన్నీ మన కెందుకురా!

పాపన్న : మన కెందుకా!

ఊరు కొడితే నేమి ఫలము
పల్లె కొడితే నేమి ఫలము
కొడితే గోల్కొండ కొట్టాలి
నెల్లూరు బస్తీలు కొట్టాలి
కందనోలు మహళ్ళు కొట్టాలి
మైసూరు దేశం కొట్టాలి

సర్వమ్మ: ఒరేయ్ పాపన్న! మనకు డబ్బులేక నిన్ను కుల వృత్తి చేయు మంటున్నానను కొంటున్నావురా! మన జీవనానికి లోటు లేదురా! పాపన్నా! నా మాట వినరా! నా యాశ లన్నీ నీ మీద పెట్టు కొన్నానురా! ఈ యింటికి వెలుగు నీవేరా! నీవు కోటలంటున్నావు, గోల్కొండ అంటున్నావు. ఈ మాటలు వింటుంటే నాగుండె బేజారెత్తి పోతుందిరా! ఉన్న ఒక్క కూతురు బ్రతుకు ముక్క చెక్కలై పోయింది. దాని జీవితాన్ని తలచు కొంటేనే గుండె చెరువై పోతుం దిరా! ఈ పాటికి దాని కడుపు పండి ఒక మొక్కైనా మొలిచి ఉంటే ఆ మొక్కే దిక్కను కొని సాకుతూ జీవి తాన్ని ఎలాగో నెట్టికొచ్చేది. ఆ అదృష్టాన్ని కూడ దాని నుదుట వ్రాయ లేదా భగవంతుడు. మొగుడూ, బిడ్డాలేని మొండి బ్రతుకై పోయింది. దాని బ్రతుకు నలా బండలు చేసిన వాళ్ళు ఆ నవాబు సైన్యంలో వాళ్ళే కదరా! రేపు పొద్దున్న నీకేదయిన అయితే నే బ్రతగ్గలనురా! వాళ్ళతో గొడవ పెట్టుకొని మనం బట్ట కట్ట గలమా! వాళ్లెక్కడరా? మన మెక్కడరా?

పాపన్న: అమ్మా! నీవే యిలాగంటే..........

సర్వమ్మ: అవునురా! నాబాధ నీకేమి తెలుస్తుందిరా! నీ సావాస గాళ్లందరూ చెట్టు నెక్కించి నిచ్చెన తీసి వేసే ప్రబుద్ధులు. చుట్టూరా శ్రీవైష్ణవులు, చూస్తే కల్లు కుండ కనిపించదన టానికి చెప్పదగిన వాళ్లు. యిటువంటి వాళ్ళ మధ్య సె రహస్యం పొక్కితే . . . .

పాపన్న: అమ్మా! వాళ్ళు ప్రాణాలీయడానికి సిద్ధ పడిన వాళ్లే గాని తీయడానికి అంగీకరించే ద్రోహులు గారు.

సర్వమ్మ: పాపన్నా! పట్టు పట్టుమనే వాళ్ళేగాని పట్టేవాళ్లు ఒక్కరూ ఉండరు. అదీ గాక నా గుండెలో ఎంత దుఃఖం గూడు కట్టుకొని వుందో నీకేం తెలుసురా!

పాపన్న : నేనుండగా నీవెందుకమ్మా దుఃఖ పడడం?

సర్వమ్మ: నీ వుండబట్టే మొలబంటి దుఃఖంలో, మోకాలి బంటి సంతోషంతో బ్రతుకుతు న్నానురా!

పాపన్న : మొలబంటి దుఃఖ మేమిటమ్మా!

సర్వమ్మ: ఏమిటని అడుగుతున్నావు కాబట్టి చెబుతాను విను.

నేను కాపురానికి వచ్చిన కొత్తలో ఈ తాటి కొండలో ఇన్ని కొంపలు లేవు. ఇంత గడుసువాళ్ళు కూడ కాదు ఆనాటి వాళ్ళు. ఒకసారి అంటే అప్పటికి నీవు తప తప అడుగు లేస్తున్నావు. చెల్లెలు కడుపున పడ్డది. నవాబు సైన్యంలో వాళ్ళే కాబోలు, పది మంది గుర్రాల మీద వచ్చి నాలుగు బస్తాల బియ్యం ఇవ్వాలని పట్టు బట్టారు. వాళ్ల తాతల సొమ్ము దాచి పెట్టినట్లుగా ప్రవర్తించారు.

పాపన్న : ఈ దోపిడీలు అప్పటి నుంచి సాగు తున్నాయన్న మాట. అయితే, మన వాళ్ళు బియ్యమిచ్చారా!

సర్వమ్మ: ఏం జేస్తాడు పాపం! వాళ్ల పొగరుబోతు తనానికి జడిసి కొంత మంది ఇయ్యడానికే సిద్ధపడ్డారు. కాని మీ నాన్న, మరొక ఇద్దరు – "మనం ఎంత కాలం భయపడుతూ ఈ బ్రతుకుల బ్రతకాలని" అడ్డు పడ్డారు. వాళ్ళు వీళ్లను బెదిరించారు, కత్తులు దూశారు. అయితే ఊళ్లో వాళ్లందరూ ఏకమై తిరగ బడటంతో గుర్రాలకు పని చెప్పారు. అప్పటి

నుంచి మనవాళ్లు ఎప్పుడేం జరుగు తుంపోననే భయంతోనే జాగ్రత్తగా ఉండేవారు. ప్రతీ పిల్ల వాడికి కూడ కర్ర తిప్పడం నేర్పేవారు.

పాపన్న : అదీ! అలాగ వీరోచితంగా నడవాలి.

సర్వమ్మ: అదే మన కొంప ముంచిందిరా! జరిగిన దానికి ప్రతీ కారంగా వేసవి కాలం ఒక రాత్రి వేళ ఊరంతా మాటు మణిగిన తరువాత హఠాత్తుగా వచ్చి పడ్డారు. ఎంత మంది పడ్డారో అన్నది ఇప్పటికీ తెలీదు నాకు. రావడం తోనే ఆరుబయట వాకిట్లో పడుకొన్న మీ నాన్నను ఇంట్లో ఉన్న నేను బయట జరుగుతున్న గొడవ విని లేచేటప్పటికే పొడిచి వేశారు. లోపల నుంచి బయటకు రాబోతున్న నన్ను రక్తపు మడుగులో కొట్టు కుంటూనే 'రావద్దు, తలుపు తీయవద్ద'ంటూ ప్రాణాలు విడిచి పెట్టేశారు రా!

పాపన్న ! ఎంత కిరాతకానికి ఒడి గట్టారు!

సర్వమ్మ: ఒరేయ్ పాపన్నా! పగ బట్టిన పాము కాటు వేయక మానదురా! ఈత నేర్చిన వానికే జలగండ మన్నట్లు ఇటువంటి ఉద్యమాల లోనికి దిగిన వానికి నిత్యం ప్రాణ సంకటమే. మృత్యు వెప్పుడు ఏరూపంలో వస్తుందో చెప్పలేం. చిరుత పులి కడుపున పెద్ద పులి పుట్టినట్లు తండ్రి లాగే నీవు కూడ యీ మధ్య సావాస గాళ్లను జేర్చుకొని కత్తి యుద్ధం నేర్పుతున్నావు! ఈ సంగతి నవాబునకు గాని, నవాబు సైన్యంలో వాళ్లకుగాని తెలిస్తే మన బ్రతుకు లేం గావాలిరా! ఇప్పటికే భర్తను పొగొట్టుకున్న నేను కొడుకు విషయంలో ఏం జరిగినా తట్టుకో లేనురా! నా

మాట వినరా పాపన్న! నీకు దణ్ణం పెడతాను. మన వృత్తి, వ్యవసాయం, పశువులు చూసుకోరా!

పాపన్న :
ఏది ఏమైనా సరే నేను
ఏరు కట్టి వ్యవసాయము
ఇప్పుడు చేయ లేనమ్మా
ఎంగిలి ముంత ఎత్తలేను
కొడతాను గోల్కొండ కోటను
మూడు గడియల్లో బందరు కొడతాను
మూలకోట కందనోలు చూచి
బంగారు కడియాల్ పెట్టుదును
మన కంత బంట్రోతు తనమేల?
ప్రాణానికే భయపడట మేల?

సర్వమ్మ: పాపన్నా! బంగారు కడియాలవసరము లేదురా! మన కున్నా ఆస్తి చాలురా ఒబ్బిడి చేసికుంటే! అదీ కాక, యీ వంశాన్ని యింతటితో ఆగి పోయేలా చేయకురా! ఆ మొదటి దీపం ఆరి పోయినా, నేను ఏ చిన్న దీపం గురించి అల్లాడి పోయేనో ఆ దీపా న్నుండి మరొక దీపం వెలిగేటట్లు చూడరా! యీ యింటిని యింతటితో చీకట్లో మునిగి యేటపోట్లు చేయకురా!

పాపన్న : అమ్మా! ఏమిటా మాటలు.

సర్వమ్మ: అవునురా! నా బాధ నీకేం తెలుస్తుంది? చిన్న మొలకగా నున్న నిన్ను ఆ దుర్మార్గులేమైన చేస్తారేమోనని కదరా! ప్రాణాలు పోతున్నా, రక్తపు మడుగులో కొట్టు కుంటూ కూడ మీ నాన్న తలుపు తీయవద్దని జెప్పడం. ఇక తల్లిగా నీ కోసం పడే కష్టాల కంతుందిరా!

పాపన్న : తల్లి తన బిడ్డ కోసము పడే కష్టాలు చెప్పడం మొదలు పెడితే విలువ కట్టలేని వారిరువురి అనుబంధాల్ని తక్కువ జేయుడ మవుతుందమ్మా !

సర్వమ్మ : తల్లి గురించి యింత గొప్పగా చెబుతున్న నీవు నాదొక మాట నెరవెర్చాలిరా !

పాపన్న : నీ మాట నా జీవితా శయాన్ని దెబ్బకొట్టేది కాకూడదమ్మా !

సర్వమ్మ : నీ జీవితా శయాన్ని దెబ్బ కొట్టేదో, అందల మెక్కించేదో నాకు తెలియదు.

పాపన్న : అయితే చెప్పు.

సర్వమ్మ : ఊరికే చెబితే ప్రయోజన మేమిటరా !

పాపన్న : ఆలోచించ డానికైనా ప్రయత్నిస్తాను.

సర్వమ్మ : జోడులేని బ్రతుకు తాడులేని బొంగరము వంటిది. నవ రత్నము లున్నప్పటికి నారీ రత్నము ఉండాలిరా! నీ చెల్లెలి ఆడుపడుచు, అదేరా దుగ్గన్న చెల్లెలు – వసంత చక్కని పిల్ల, ఈడూ జోడూ బాగుంటుంది. పెళ్లి చేసి కొని – బుల్లి పాపన్న పుట్టిన తరువాత నీ యిష్టంరా! అప్పుడు నీ మార్గానికి, నీ ఆశయానికి, నీ ఉద్యమానికి అడ్డు రానురా!

పాపన్న : ఆలూ లేదు, చూలూ లేదు, కొడుకు పేరు సోమలింగం అంటే ఎలాగమ్మా! అసలు నాకు పెళ్లా! పోరాటమే లక్ష్యంగా పెట్టుకొన్న నాకు ప్రాణాలంటే లక్ష్యంలేదు. అటువంటి నాకు పెళ్లంటే అవతల అన్నెం పున్నెం

తెలియని ఒక అమాయకురాలి గొంతు కోసెయ్యడమే అవుతుంది. అదీ గాక నా కోసం నా మిత్రులందరూ తమ జీవితాలను ధార పోస్తామని ప్రమాణాలు చేసి ఉన్నారు. నేను కూడ వారికి మాట ఇచ్చియున్నాను. నా మాటంటే నీకు తెలుసు గదా! అది అలా ఉంచు. నేను ఒక్కడిని ఈ సుఖాల కోసం చూసుకుంటే ఈ దారుణాలిలాగే అడ్డూ అపూ లేకుండగా సాగి పోతుంటాయి. వీటి కంతము ఉండదు. దీని కడ్డు కట్ట వేస్తే నేనే వేయాలి.

సర్వమ్మ: ఒరేయ్ పాపన్నా! నా మాట వినరా! మొన్న మన బంగారమ్మ ఇంటికి వెళ్లావు గదా! వసంతను చూశావు గదా! నీకే మనిపించిందిరా! అసలు నచ్చిందా!

పాపన్న: అమ్మా! ఈ పాపన్న దేనికి లొంగడమ్మా!

మానిని వాలు చూపులకు మాటల తీపికి లొంగు జీవుడం
గాను, మదీయ దీప కళికా జ్వలనంబది యార కుండగా
పూనిక యాగునే! యెడద పొంగులు తగ్గునె! నిద్రపట్టునే!
ప్రాణము వాఙ్మనః క్రియల లక్ష్యపుసిద్ధికి ధార వోసెదన్

సర్వమ్మ: పాపన్నా! నీ మొండి పట్టేకాని నా ఆవేదన ఏమిటో అర్థం జేసి కోవేమిటిరా?

పాపన్న: అమ్మా! నీవు లోపలికి వెళ్ళు హనుమంతు తెలగన్న వాళ్ళు వస్తున్నారు.

(సర్వమ్మ లోపలకు వెళ్ళునప్పటికి హనుమంతు, తెలగన్న, కోటయ్య, పైడప్పలు ప్రవేశింతురు.)

పాపన్న: రండి, రండి కూర్చోండి. మన ఉద్యమ కార్య క్రమాలెంత వరకు వచ్చాయి?

హనుమంతు : పాపన్నా! ఔత్సాహికులైన కార్య కర్తల్ని ప్రోగుచేసి వారికి మాకు వచ్చిన యుద్ధ విద్యల్ని నేర్పుతున్నాం. ఏది ఏమైనా నీవు రంగం లోనికి దిగితే గాని ఉద్యమం వేగాన్ని పుంజుకోదు.

కోటయ్య: ఈ విధంగా మనం చాప క్రింద నీరులా జనాన్ని కూడ గట్టడం చాల క్లిష్టంగా ఉంది. కొంచ దీసి ఈ సమాచారం గాని ఎవడయిన నవాబు చెవిలో ఊది నట్లయితే మనం ప్రాణాల మీద ఆశవదులు కోవల్సిందే.

తెలగన్న : ఇప్పటికే మనం కత్తులు త్రిప్పుతుంటే కొందరు చెవులు కొరుక్కుంటున్నారు. ఎంత తొండమున్నా దోమ ఏనుగు కాదు - అని నవాబు తాలూకు పెద్ద ఉద్యోగులు కొట్టి పారవేస్తున్నారు కాని లేక పోతే ఈ పాటికే మనం చేస్తున్న పనికి అడ్డంకి వచ్చి పడేది; కొంప మునిగేది. ఎంత కాలం మనకీ ముసుగులో గుద్దులాట. ఈ సంగతి బయట పడక ముందే మనమే ఇక్కడ నుండి జెండా ఎత్తి వేసి మరొక చోట జెండా ఎగుర వేయాలి.

పైడప్ప : ఒక వంద మంది కత్తులు పట్టు కొన్నంత మాత్రాన జెండా ఎగుర వేస్తానంటే సరి పోదయ్యా! మనకు పూర్తి బలము చేకూరే వరకు ఆ పని చేయలేము.

పాపన్న : పైడప్పా! నీవు చెప్పేది నిజమే కాని, అలాగయితే పిచ్చి కుదిరే వరకు పెళ్లి కాదు. పెళ్లి అయ్యేవరకు పిచ్చి కుదరదు అని నట్లుంటుంది. మన లక్ష్య సాధన, అనుసరించే విధానమును బట్టి ఉంటుంది. ప్రతి కాల పరిస్థితుల్ని అధిగమించుట లోనే మన గొప్పతనం వ్యక్తమౌతుంది.

సర్వము యత్నాధీనము. ఆ యత్నము సకాలములో జరిగినప్పుడే విజయవంతమవుతుంది. కనుక తెలగన్న చెప్పినట్లు ఇలా నాన్చితే కొంప మునుగుతుంది. అది అలాగ ఉంచి మన ఉద్యమానికి జనాన్ని మీరెలా సేకరించారో వివరించండి. ఎందుకంటే మన దండులో నున్న వారందరికి నాపై విశ్వాస మెంత వరకున్నదో, మీరెట్లు కలిగించి నారో ముందు నేను తెలిసికొన వలసియున్నది. ప్రజల మనో వీథిలో నున్న విశ్వాసమును బట్టియే నాయకుని మనుగడ వుంటుంది.

హనుమంతు: మన సిద్ధాంతములు, మన ధ్యేయములు గూర్చి ముఖ్యంగా మీగురించి ప్రచార మొనరించుట లక్ష్యంగా పెట్టుకొన్న నేనిట్లంటిని.

ఎంత కాలంబు మన మిట్లు లెదురు లేని
దోపిడీలకు గురియౌచు దోసి లొగ్గి
బ్రతుకు సాగించ గలమయ్య? పౌరుషంబు
లేదె! సర్వాయి పాపన్న లేడె మనకు?

అడుగో! పాపన్న వస్తాడంటే
కుందేళ్ళు కూలబడును,
లేడి పిల్లలు లేవ లేవు
పసి బిడ్డలు పాలు తాగరు
నక్కలు సింహాలు తొక్కుకు ళ్ళాడును.

తెలగన్న: పాపన్న అంటే ఎవరను కొంటున్నారు? మన కోసం, మన ఉద్యమం కోసం, మన స్వాతంత్ర్యం కోసం ఎన్నో విడిచి పెట్టి కొన్న వ్యక్తి. తనను తాను నియమించు కొన గల్గిన

వాడే అనుకొన్న కార్యమును సాధించగలడు సప్త వ్యస నాలలో ఒకటైన తాగుడును మాని వేసి నాడంటే ఎంత నిగ్రహం కలవాడో. ఎంత పట్టుదల ఉన్నవాడో మనము గ్రహించు కోవాలి. అసలు ఒకప్పుడు పాపన్న తాగెడి కల్లుకే ఒక విశిష్టత ఉండేది.

పాపడు తాగెడి కల్లూ
ఏ తాటి ఏ తాటి కల్లు?
వ్రేలు పెడితే వ్రేలు తెగును
దివిటీ పెట్టితే భగ్గున మండును
త్రాగే టప్పుడు తీయగ నుండును
తాగిన వాణ్ణి లేవనివ్వదు
లేచిన వాణ్ణి పోవనివ్వదు
పాపడు తాగెడి కల్లూ
ఏ తాటి ఏ తాటి కల్లు?

మన ఉద్యమం కోసం చిన్నతనం నుండి అంత విపరీతంగా అలవాటున్న వ్యసనాన్నే మాని వేయడం జరిగిందంటే ఇంక మనం ఎలా ప్రవర్తించాలో ఆలోచించండి. ఏదైతే అలవాటు పడితే మాను కోలేమో అదే వ్యసనం. దాని మంచి చెడ్డలను బట్టి ఒక మనిషి బాగోగులుంటాయి. చెడ్డదని తెలిసికున్న అట్టి వ్యసనాన్ని విడిచి పెట్టడం పాపన్నకే చెల్లింది. పాపన్న వలెనే మనము కూడ ఇప్పటి నుండి తాగుడు కట్టి పెట్టాలి.

పైడప్ప: సర్వానర్థాలకు కారణమయిన కామాన్ని, వ్యక్తికే కాక తత్సంబంధీకులందరికి అనర్థాన్ని తెచ్చి పెట్టే త్రాగుడును విడిచి పెట్టిన పాపన్న నాయకత్వం లభించడం మన అదృష్టమే. ఎందు చేతనంటే.

మ: మన పాపన్న కుల ప్రభేదములు సంభావింప నంగీకరిం
పని తత్త్వంబు గలట్టి వాడు మొదటన్ బాటించి తాజెప్ప త్రో
వను నిత్యంబు చరించువా డనృతమౌ వాక్యంబు ప్రాణాలు పో
యిన నోటన్నుడువండు మాకనగ నేమీ! సర్వ పూజ్యుండగున్

కోటయ్య: పాపన్నకు ఉద్యమమే ఊపిరి. ధైర్య విశ్వాసాలు రెండు
దాని పురోగతికి సాధకములని అయన అభిప్రాయము.
ఆ స్వతంత్ర జీవికి సొంత ఆలోచన ఉండవని పదే పదే
వారి హెచ్చరిక. ఉత్సాహమే ఉద్యమానికి ఆయువుపట్టు.
ఆ ఉత్సాహము యువకుల ఆస్తి. కనుక యువకులైన
వారు ముందుకు రావాలని పాపన్నగారి ప్రబోధము. ఇట్టి
వ్యక్తి యొక్క పరాక్రమము సామాన్యమైనది కాదు.
పాపన్న గాని విజృంభించినచో

అబ్బా! అబ్బా! పాపని యొక్క పేరు చెప్పితే
ఊర పిచ్చుక పొలముః బారదు.
పొట్టి పిచ్చుక వూరు చేరదు
కొంజులూ కారాడు తుండు
నక్కలు నాట్యమూ దొక్కు
పంది కొక్కు డోలు కొడతాది
దొంతి కుండలు గంతులేస్తవి
పసి బిడ్డలు పాలు తాగరు
గుర్రాలు గుగ్గిళ్ళు తినవు
పాపన్న పేరు చెప్పితే
గోల్కొండ బస్తీ లొణుకు
నెల్లూరు బస్తీ లొణుకు
బందరు బస్తీ లొణుకు

కడప జిల్లా లోనుకు
పాపన్న పేరు వింటే -

అటువంటి పాపన్న ఉద్యమనాయకుడు కావడం నిజంగా మనం విజయపథంలో ఉండడమే

ఉద్యమ వ్యక్తులకునైన ఉద్యమమున
కైన దుర్మార్గుడెవడైన హానిజేయ
వాడు శవము గాకుండ పాపన్న కన్ను
మూతపడదు; శత్రువుల యముండతండు

పాపన్న : భేష్, భేష్. పరిస్థితులనే గాక వ్యక్తులను గూడ మన కనుగుణముగా త్రిప్పుకోవడములోనే ఉద్యమ పురోభివృద్ధి ఆధారపడి ఉన్నది, అయితే ఇది అంతా వాక్స్వాతంత్ర్యము ప్రధానముగా జరిగినది. ఇక మీదట మనము కార్య శూరులముగావలసి యున్నది. ఇంత వరకు మీ కృషి వలన ఉద్యమములో చేరిన ఔత్సాహిక కార్యకర్తలు మూలధనముగా ఉపయోగపడుదురనుటలో సందేహము లేదు. కాని పైడన్న చెప్పినట్లు వీళ్ళు మనకు సరిపోరు. అందుచే కొందరికి జీతాలిచ్చి దండును పెంపుచేయవలసి యున్నది. జీతాలివ్వాలంటే డబ్బుకావాలి. దానికి మార్గాలాలోచించండి.

హనుమంతు: మనకు డబ్బు కావాలంటే ఊళ్ళమీద పడి నవాబు సైన్యంలో కొందరు దోచుకొంటున్నట్లు దోచుకోవడమే మార్గం.

పైడప్ప : వాళ్లకు మెరుపుదాడి చేయుటానికి గుర్రాలున్నాయి. మనకు గుర్రాలేవి.

పాపన్న : ఊళ్ల మీదపడి దోచుకుంటే నవాబు సైన్యానికి మనకూ తేడా ఏమిటి ? కనుక కొందరు ధనికుల్ని తమకు తోచిన సహాయాన్ని మన ఉద్యమాని కందజేయవలసినదిగా కోరండి. ఉద్యమానికి ప్రజల సానుభూతి ఆయువు పట్టగునట్లు మసలుకొనవలెను గాని ద్వేషభావము ప్రబలునట్లు వర్తించకూడదు. మనం ఇకముందు వాళ్లమీదపడి దోచుకుంటున్న నవాబు సైన్యమును దొంగచాటుగా అటకాయించి వాళ్లగుర్రాల్ని, ధనాన్ని స్వాధీనం చేసికోవాలి. గూట్లో దొంగిలించిన వాళ్లు వాళ్లయితే. ఒళ్లో దొంగిలించిన వాళ్ళు మనం కావాలి. అయితే కొంతకాలము వరకు మన మెవర మెక్కడ ఉంటున్నామో ఎవరికీ తెలియ కూడదు.

తెలగన్న: అలా తెలియ కూడదంటే ఇక్కడ నుంచి మకాం మార్చివేయాలి.

పాపన్న : తెలగన్నా! నీవు చెప్పింది బాగుంది. మకాం మార్చివేయాలన్నా, ఏ పని చేయాలన్నా శీఘ్ర ప్రయాణానికి గుర్రాలు కావాలి.

తెలగన్న: గుర్రాలు కావాలంటే ధనం కావాలి. ధనం మూల మిదం జగత్.

కోటయ్య: డబ్బు ఉంటే కొండ మీద కోతిని కూడ రప్పించ వచ్చు.

హనుమంతు : ఊళ్ల మీద పడి దోచుకో కూడదు. దోపిడీ దారుల్ని ఎదుర్కొనే స్థితిలో మనము లేము.

పైడప్ప: నవాబు ఖజానాకే రహస్యంగా ఆ చూకీ తీస్తే!

తెలగన్న: ఉట్టికెక్కలేనమ్మ స్వర్గాని కెగిరి నట్లుంటుంది. పురిటి లోనే సంధి కొట్టే మాట లెందుకయ్యా!

పాపన్న : ప్రస్తుతం మనకు కావలిసింది గుర్రాలికే కదా! దానికి నేనేర్పాటు చూస్తాను. కాని మీరీలోగా అతి జాగ్రత్తగా కార్య కర్తల్ని సమీకరించాలి. శుభ సంకల్పానికి శ్రద్ధతో కూడిన ఉద్యమం సాగి నప్పుడే ఫలిస్తుంది. అంతే కాదు ; ఈ విషయాన్ని బయటకు పొక్క నీయ కూడదు.

తెలగన్న : కొద్ది రోజులు రహస్య కార్య కలాపాలు సాగిస్తే చాలు.

కోటయ్య : గోడలకు చెవులుంటాయి! పరిస్థితులు చే దాటక ముందే మనము బయట పడాలి.

హనుమంతు : సాధ్యమైనంత త్వరలో పరిష్కార మార్గం కనుగొనాలి.

పాపన్న : పైడప్పా! ఈ సాయంత్రం ఒక సారి కనిపించు.

పైడప్ప : తప్ప కుండగా!

పాపన్న : మరొక్క విషయం మీరు మర్చి పోకూడదు! ఉద్యమం ఊపందు కొంటున్న ఈ తరుణంలో నిత్య సాధన మాన కూడదు.

హనుమంతు : సరే! మేముంటాం.

పాపన్న : వెళ్లి రండి.

(పాపన్న తప్ప అందరూ నిష్క్రమింతురు)

పాపన్న : (కొంత సేపు తీవ్రంగా ఆలోచించి) అమ్మా! అమ్మా!

సర్వమ్మ : ఏమిరా! వాళ్లు వెళ్లిపోయారా!

పాపన్న : వాళ్లు వెళ్లి పోయారు కానీ! ....

సర్వమ్మ : కానీ........

పాపన్న : ఇందాక మాటల సందర్భములో మనకు డబ్బు లోటు లేదన్నావు కదా!

సర్వమ్మ: అన్నాను, అంటే....

పాపన్న : ఆ డబ్బు కావాలి.

సర్వమ్మ: ఆ డబ్బెక్కడుందో నాకేం తెలుసు!

పాపన్న : అమ్మ పెట్టా పెట్టదు, అడుక్కు తినా తిన నీయదు అను మాటను నిజం చేస్తున్నావు.

సర్వమ్మ: అసలూ, డబ్బు సంగతి ఇప్పుడెందుకురా?

పాపన్న : ఇప్పుడెందుకేమిటి? అవసరము వచ్చింది ఇప్పుడే!

సర్వమ్మ: నే నెందుకు లేదంటున్నానో నీ వర్థం చేసి కొంటాలేదురా! నా మాట వినరా! లేని పోని ఆలోచనలు పెట్టుకొని సంసారాన్ని పాడు చేయకురా!

పాపన్న : మళ్ళీ మొదటికి వచ్చావు! పిచ్చి కుదిరింది రోకలి తలకు చుట్ట మన్నట్లుంది.

సర్వమ్మ: నా కంఠంలో ప్రాణ ముండగా నే నివ్వనురా!

పాపన్న : అయితే నీకు కొడుకు కంటే డబ్బే ఎక్కువన్న మాట.

సర్వమ్మ: తల్లి కంటే నీకు నీ పంతం ఎక్కువనే కదా!

పాపన్న : నాకు నీ మీద పంతమేమిటి? నా ఉద్యమం కోసం నాకు డబ్బు కావాలి.

సర్వమ్మ: అందుకే వద్దంటున్నాను.

పాపన్న : అందుకే అంటే!

సర్వమ్మ: నీవు ఉద్యమం లోనికి వెళ్ళడం, నాయకత్వం వహించడం, కోటలు కట్టి బూనడం, దండెత్తడాలు వద్దంటున్నాను.

పాపన్న : అమ్మా! ఏ మనిషీ ఎల్లకాలం బ్రతకడు. బ్రతికినంత కాలం పౌరుషంగా ఒకడికి తలవంచకుండా బ్రతకాలి. అందుకే ఈ ఆరాట పోరాటాలు.

సర్వమ్మ: ఎల్లకాలం ఎవరూ బ్రతకరని గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించునట్లు, నాకు చెప్తున్నావురా! బ్రతక వలసినంత కాలము బ్రతకడమే బ్రతుకుకి లక్షణం. అంతే కాని ఎప్పుడో ఒకప్పుడు చావ వలసిందే కదా అని బ్రతుకు మధ్యలో ప్రాణాల్ని బలిచేయడం లోక ధర్మం కాదు.

పాపన్న : అమ్మా! నా జీవితాశయం నెరవేర్చుకోలేని బ్రతుకు నాకవసరం లేదు.

సర్వమ్మ: ఏమిటిరా నీ జీవితాశయం?

పాపన్న : గోల్కొండ సింహాసనాన్ని ఎక్కడం.

సర్వమ్మ: కొడుకు రాజయితే ఏ తల్లి సంతోషించదురా! ఒరే పాపన్నా! నీ ఆశయం నీ శక్తికి తాహతుకు మించి పోయిందిరా! నీవు శక్తివంతుడివే, కాదనను, కాని ఏనుగు వెళ్ళి కొండను ఢీ కొనడం వంటిదిరా!

పాపన్న : సరే నీవన్నట్లు ఆ కొండను ఢీ కొనడానికి కొండంతటి బలం సేకరించుకోవడానికి నేను డబ్బు కావాలంటున్నాను.

సర్వమ్మ: కొండను ఢీ కొనడానికి పూనుకొన్న మీ నాన్నను పోగొట్టు కున్నాను. నా బాధ నీకేం తెలుస్తుందిరా! తండ్రి బుద్ధులు ఒంట బట్టిన నీవు నా మాట ఎందుకు వింటావ్వురా!

పాపన్న: అమ్మా! నీ మాట ఎప్పుడన్నా కాదన్నానా! ఇప్పుడూ అదే మాట. నీవు డబ్బెక్కడుందో చెప్పక పోతే నేనేమీ నిన్ను బాధ పెట్టను. కాని ఒకటే మాట. ఇక నా ముఖం నీకు చూపించను. ఇదిగో కట్టుబట్టలతో బయటకు వెళ్లి పోతున్నాను.

సర్వమ్మ: ఒరే పాపన్నా! నీవు తెందే ఈ డబ్బు నాకెందుకురా! నా తిండికా లేక నా మీద వేసి కొని పండించు కోవడానికా ఈ డబ్బు! రా! మీ నాన్న దాచిన డబ్బు ఎక్కడుందో చూపిస్తాను. నేను బాధ పడేది నీ గురించి (ఏడుపు ఆపు కొంటూ) అయితే నా మాట ఒకటి మన్నించాలి.

పాపన్న: మన్నించడ మేమిటమ్మా! చెప్పు తప్ప కుండగా శిరస్సు వంచి చేస్తాను. అసలెప్పుడైన నీ మాట కాదన్నానా! అయితే నా ఉద్యమానికి ఆటంకం కలిగేది కాకూడదని మళ్లీ చెప్తున్నాను.

సర్వమ్మ: నీ ఉద్యమానికి ఆటంకం కాదు. పయిపెచ్చు నేను చెప్పింది జాగ్రత్తగా ఆలోచిస్తే నీ మార్గాన్ని సులభతరం చేస్తుంది.

పాపన్న: అలాగయితే ఇంకా చూశావూ! త్వరగా చెప్పు.

సర్వమ్మ: నీ చెల్లాయి ఆడ పడుచు వసంతను పెళ్లిచేసి కొంటే... ?

పాపన్న: అమ్మా! నే చెప్పిందంతా అరణ్య రోదనం లా వుంది. మళ్లీ అదే మాటా!

సర్వమ్మ: నే చెప్పిన మాట పూర్తిగా వినరా!

పాపన్న : సరే చెప్పు.

సర్వమ్మ: ఆ పెళ్లి చేసికొంటే వాళ్ల వెనుకా ముందు ఎవ్వరూ లేరు కాబట్టి ఆ ఆస్తి అంతా నీకే దక్కుతుంది.

పాపన్న : చెప్పిన మాటనే మరలా చెప్తున్నావు. నేను చెప్పిన దంతా చెవిటి వాని ముందు శంఖ మూది నట్లయి పోయింది! ఇందాక చెప్పింది కూడ ఇదే మాట కదా!

సర్వమ్మ: ఇందాక చెప్పడం వేరు, ఇప్పుడు చెప్పడం వేరు. అప్పుడు పెళ్ళి పేరు చెప్పి ఏదో విధంగా ని సావాస గాళ్లతో నిన్ను వేరు చేయాలని చూశాను. ఏ స్వార్థమూలేని పుత్ర మమ కారంతో చెప్పిన మాట అది.

పాపన్న : అయితే ఇదీ!

సర్వమ్మ: నీవెలాగూ ఉద్యమం లోనికి వెళ్లడం మానవు గనుక నేనొక నిర్ణయానికి వచ్చి కొంత స్వార్థంతో చెప్తున్న మాట ఇది.

పాపన్న : అంటే!

సర్వమ్మ: అంటే ఏమిటిరా! ఆ అమ్మాయినే పెళ్ళిచేసికొంటే నీ ఉద్య మానికి కావలసినంత డబ్బురా!

పాపన్న : ఆ అమ్మాయి గొంతు కోయలేను!

సర్వమ్మ: నీ ఉద్యమానికి డబ్బు! మన డబ్బే సరిపోతుందా!

పాపన్న : సరిపోదు.

సర్వమ్మ: కనుకనే నే చెప్పినట్లు చెయ్యి.

పాపన్న : (ఆలోచనలో పడతాడు)

సర్వమ్మ: పాపం అని ఆలోచిస్తున్నావు కదూ!

పాపన్న : అవునమ్మా! డబ్బుకోసం ఇటువంటి కక్కుర్తి పనులు చేయలేనమ్మా!

సర్వమ్మ: అయితే ఒక ఆలోచన చెపుతాను విను.

పాపన్న : ఏమిటది?

సర్వమ్మ: భర్తను పోగొట్టుకొన్న నీ చెల్లెలు, అన్నను పోగొట్టుకొన్న వసంత నీవలెనే నవాబు సైన్యంలోని కిరాతకుల మీద కోపంతో ఉన్నారు కదా!

పాపన్న : ఉన్నారు, ఉంటే –!

సర్వమ్మ: వాళ్ళను మట్టు పెట్టడానికి కొంత డబ్బు అడుగు. వాళ్ళపై కసి తీర్చుకోవడమే నీ పని అని చెప్పు. అదీ కూడ నిజమే కదా! నీ ఉద్యమం గూర్చి పూర్తిగా వివరించు.

పాపన్న : నిజమే! ఆ కిరాతకులను మట్టు పెట్టకుండగా నా ఆశయం నెరవేరదు కదా! నా ఉద్యమ లక్ష్యం ఏమిటో కూడ వివరిస్తాను.

సర్వమ్మ: నీ కసలు వసంత గురించి తెలుసా!

పాపన్న : ఏమిటి.

సర్వమ్మ: ఆ అమ్మాయి కర్ర పట్టుకొని మగ వాళ్ళను కూడ ఎదిరించ గలదట.

పాపన్న : అలాగా!

సర్వమ్మ. అందుచేతనే చెప్తున్నాను. వీళ్ళకు మనశ్శాంతి చేకూరుతుంది. వాళ్ళకు తగిన శాస్తి చేసినట్లవుతుంది. నీ ఆశయం నెరవేరుతుంది. ఇందులో అన్యాయ మేమిటి?

పాపన్న : సరే అలాగే చేస్తాను. వాళ్లింటికి రేపే బయలు దేరుతాను. ఏదీ మా నాన్న దాచిన డబ్బు చూపించు.

సర్వమ్మ: రా లోపలికి.

(సర్వమ్మ పాపన్న లిరువురు లోనికి పోవుదురు)

పైడప్ప: పాపన్నా! పాపన్నా!

పాపన్న : (లోపలి నుండి వచ్చి) పైడప్పా! ఈ డబ్బు తీసికొని వెళ్లి రెండవ కంటి వాడికి తెలియకుండగా మంచి నాణ్యమైన గుర్రాలను కొనండి. మనపై అనుమానం రాకుండగా ఎవరికి వారే విడి విడిగా బేరాలు చేయండి. పదార్థాలన్నీ సేకరించుకొని మన పశువుల మందల సమీపంలో నున్న కొండ లోయులో ఉండండి. మిమ్మల్ని త్వరలో వచ్చి కలుస్తాను..

పైడప్ప: కొత్తగా మన దండులో చేరిన వారందరు మిమ్మల్ని చూడాలని ఆరాట పడుతున్నారు. ఒక్కసారి ఈ రాత్రికి సాధన స్థలానికి వస్తే బాగుంటుందేమో!

పాపన్న : రాత్రికి ఈ పని మీదనే వేరే చోటికి వెళ్లవలసి యున్నది. ఎప్పుడో ఒకసారి వచ్చి అందరినీ కలువగలను. ఈ లోపున మీరు సేకరించ గల్గినంత సామగ్రిని సేకరించండి. నేను రావడం తోనే మనం కొన్ని గ్రామాల్ని స్వాధీన పర్చుకొనే ఉపాయ మాలోచించవలసి యున్నది. మన ఆశయం

నెరవేరే ఉషః కాంతులు కనిపిస్తున్నాయి. మన ఉద్యమ
కార్య కర్తలందరికి నా ఈ సందేశాన్ని అందజేయండి.

మ: మన దుర్వార సముద్యమ ప్రభల సంపన్నత్వమున్ జాటగా
నమవో కాలము చేరువయ్యె హితులారా! మీరు మీ కర్తలన్
దిన మార్తాండ సమాన కాంతి తతి ఉద్దీపింపగా నూడుడీ!
మన సున్నన్ మరి తోవ యుండదిక! అస్మల్లక్ష్య సంసిద్ధికై

పైడప్ప: తప్పకుండగా! మీ కోసం తూర్పు కొండ లోయలో
ఎదురు చూస్తాం.

పాపన్న: సరే! ఒక నెల రోజులు తరువాత హనుమంతుని,
కోటయ్యను, మా చెల్లెలి ఇంటికి పులగాము రమ్మని చెప్పు.

పైడప్ప: అలాగే చెపుతాను.

ద్వితీయాంకము సమాప్తము.



# తృతీయాంకము

(పులగ్రామములో పాపన్న చెల్లెలు బంగారమ్మ ఇంటి వద్ద)

బంగారమ్మ : ఎంత పాపిష్టి దాన్నయి పోయాను. ఈ దౌర్భాగ్యపు జీవితాన్నెట్లు గడుపగలను?

పట్టుమని పది వత్సరాల్ పాటు కూడ
మగని తోడ కలిసి యుండు మనుగడకును
నోచుకోనట్టి కష్టంబు నుదుటి యందు
వ్రాసి యుండిన దురదృష్టవంతురాల

(అని దుఃఖించు చుండగా పాపన్న ప్రవేశము)

పాపన్న : (ముఖము వంచుకొని నిలబడి యుండగా)

బంగారమ్మ : (హఠాత్తుగా చూచి) అన్నా! పాపన్నా! ఎంత సేపైనది నీవు వచ్చి! ఇదే మీ బావ ఉంటే ఎంత ఆనంద పడే వారు. నీ గురించి చెప్పి ఎంతగా పొంగి పోయేవారురా! మనిషి అంటే మీ అన్నయే మనిషి. అతను మాటంటే మాటే. ఒక మనిషి గొప్పవాడు కావాలంటే అంత పట్టుదల ఉండాలి. నీటిలో పుట్టిన తామరకు నీరు అంటనట్లుగానే కల్లు గీసే కుటుంబంలో పుట్టిన పాపన్నకు త్రాగుడు కిట్టదు. మనసును తన స్వాధీన మందుంచు కొన్న వానికే అట్టిది సాధ్యమగును. అట్టి వానికి లోకమే ఆధీనములో నుండును. అతడు కర్ర పట్టుకొని పది మంది కాదు; వంద మంది నైన చెలాయించి పోగలడు. నడకలో ఠీవి, వాక్కులో అధికారం ఇవన్నీ చూస్తుంటే మీ అన్నయ్య కొన్ని గ్రామాలకు మోతుబరి కాగలడనిపిస్తుంది నాకు అని అనేవారు. నాకు మాత్రం మీ ఇద్దరూ కృష్ణార్జునుల్లా కనపడే వారు.

ఎంతగా మురిసి పోయేదాన్ని మీ ఇద్దరిని చూచి. ఆ అదృష్టం లేకుండా జేశారు ఆ నవాబు సైన్యం లోని దోపిడీ దొంగలు. (అని యేడ్చును.)

పాపన్న : అసలు నవాబు సైనికులు దుగ్గన్న బావను హత్య చేయ డానికి కారణ మేమిటి?

బంగారమ్మ : కారణం ఏమి చెప్పను! కడుపు చించుకుంటే కాళ్ళ మీద పడుతుంది అన్నట్లుగా తయారయింది వసంత.

పాపన్న : బావను చంపి వేయడానికి వసంతకి సంబంధ మేమిటి?

బంగారమ్మ : సంబంధం లేక పోవడ మేమిటి? అసలు అంతటితో సరిపోయిందా! ఇప్పుడు వాడితోనే స్నేహం కలుపుతుంది.

పాపన్న : అంటే.

బంగారమ్మ : వాళ్ల అన్నయ్య చని పోవడానికి కారకుడైన వాడితోనే ఎకసక్కాలు, పక పకలు.

పాపన్న : బావను చంపిన వాడెవడో వసంతకు తెలుసన్న మాట.

బంగారమ్మ : చంపిన వాళ్ల సంగతేమో గాని కారకుడైన వాడి సంగతి తెలుసు.

పాపన్న : అంటే ఎవడో ఒకడు వెనకాల ఉండి, కొందరిని పురమా యించి చంపించాడన్న మాట. ఇప్పుడు వాడితో ప్రేమ కలాపాలు సాగిస్తుందా!

బంగారమ్మ : అవును.

పాపన్న : ఎంతకు తెగించింది! ఇంతకూ వాడెవడు?

బంగారమ్మ : నలుగురిని వెంటబెట్టుకొని గుర్రం మీద పన్ను వసూలు చేయడానికి వచ్చేవాడు.

పాపన్న : వాడికి వసంతకు పొత్తెలా కుదిరింది?

బంగారమ్మ : పొత్తెలా కుదర మేమిటి? ఆ దుర్మార్గుడితో ఒకప్పుడు కర్ర కూడ కలిపి శంకర గిరి మన్యాలు పట్టించింది.

పాపన్న : కర్ర కలపడ మంటే కర్రసాము చేయడ మేనా!

బంగారమ్మ : అవును.

పాపన్న : అయితే వాడిని శంకర గిరి మన్యాలు పట్టించ మేమిటి, బావను చంపి వేయడానికి వసంత కారణం కావడ మేమిటి? చాలా విచిత్రంగా ఉందే!

బంగారమ్మ : ఆ విచిత్రమే నా తాళి బొట్టును తెంపివేసి, ఐదువతనం లేకుండా జేసింది. (అంటూ మాటలు రాక ఏడ్చును.)

పాపన్న : (కొంత సేపూరకుండి) అసలేం జరిగిందో చెప్పాలి గాని ఏడిస్తే....

బంగారమ్మ : తల్లీ తండ్రి లేక పోవడం కారణంగా చెల్లెల్ని ఆతి గారాబంగా పెంచారాయన. చెల్లెలంటే అన్నగారికి పంచ ప్రాణాలు. ఆయన ఎక్కడకు వెళ్ళితే ఈవిడ అక్కడ ప్రత్యక్షం. మీ బావ కర్ర త్రిప్పడం చిన్న పిల్ల వాళ్ళకు నేర్పేటప్పుడు తానుకూడ నేర్చుకుంది.

పాపన్న : అవును, వసంతకు కర్ర విద్య బాగా వచ్చుని అమ్మ చెప్పింది.

బంగారమ్మ : ఆ బాగా రావడమే నా జీవితానికి శాపమైంది.

పాపన్న : తరువాత.

బంగారమ్మ : కనపడిన ప్రతీ కుర్రవాడితో కర్ర కలపడం మొదలు పెట్టింది.

పాపన్న : అలాగా !

బంగారమ్మ : కలపడ మేమిటి? కలిపే వాడినల్లా నాలు గయిదు నిమిషాల్లో చేతిలో కర్ర లేకుండా చేసేది.

పాపన్న : అన్నగారికి తగ్గ చెల్లెలని పించుకొంది !

బంగారమ్మ : చెల్లెలి విద్యకు అన్నగారు పొంగిపోతూ ఉంటే ఆవిడకు పట్ట పగ్గాలుండేవి కావు.

పాపన్న : అవును ! ఎప్పుడో ఒకసారి నన్నుకూడ మా చెల్లెలితో కర్ర కలపాలని వెటకారంగా అనినట్లు గుర్తు. అమ్మాయి అంటే అలాగుండాలి. ఆడ వాళ్లను పచ్చడి నూరడానికే పనికి వచ్చేటట్లు తయారు చేస్తారు కాని అవసర మయితే దేని కయినా సిద్ధ పడేటట్లు తయారు చేయరు. నిజానికి స్త్రీల కున్న ఏకాగ్రత, అవగాహన శక్తి పురుషులకు లేవేమో అనిపిస్తుంది నాకు. అడవాళ్లు పూనుకుంటే చేయలేనిదేమిటి?

పుట్టినప్పటి నుండి పువ్వులే ముగ్గులే
యనుగాని వేనికి పనికి రాదు?
పుట్టినప్పటి నుండి పుణ్య వ్రతంబులే
యనుగాని వేనికి పనికి రాదు?
పుట్టినప్పటి నుండి పూర్తిగా వంటకే
యనుగాని వేనికి పనికి రాదు?
పుట్టినప్పటి నుండి బొత్తిగా నింటికే
యనుగాని వేనికి పనికి రాదు?

స్త్రీయను విధాన పెంచి పోషించు చుండ
ముందు ముందుకు సాగెడి పూరుషునకు
ఆడు చేదోడు వాదోడు నబ్బు టెట్లు
ముక్కు మూసి కొన్నట్లగు ముదితనేర్పు

బంగారమ్మ : నీ వన్నది నిజమే ఆడువారి నేర్పంతా ఇంటికే పరిమితమై పోతుంది. ఈ మహమ్మదీయుల దోపిడీలు, చెర బట్టడాలు కారణంగా ఆడు వారికి చిన్న తనంలో పెళ్లిళ్లు చేయడం తప్పడం లేదు.

పాపన్న : ఈ చారిత్రిక సత్యం కొంత కాలంగా జరుగు తున్నదే గాని తరువాత జరిగిన సంగతి చెప్పు.

బంగారమ్మ : అప్పటి నుండి వసంత కర్ర పట్టుకుంటే మేషు వుస్తాదుల మనుకొన్నవారు కూడ తప్పుకొని తిరిగే వారు. ఎవరైనా పెద్దలు మీ బావను పలుకరించి వసంతకు పెళ్లి చేయవా! దుగ్గన్నా! అని అడిగే వారు.

పాపన్న : వయసు వచ్చిన అమ్మాయికి పెళ్లి చేయకపోతే అడుగరు మరి! అయితే బావ చెప్పిన సమాధాన మేమిటి?

బంగారమ్మ : మా వసంతను కర్రసాములో ఓడించిన వానికే పెళ్లి చేస్తానని చెప్పేవారు.

పాపన్న : బాగుంది, బాగుంది, రామాయణంలో సీతను పెళ్లాడాలంటే శివధనుస్సును విరవవలసి వచ్చింది. భారతంలో ద్రౌపదిని పెళ్ళాడాలంటే మత్స్య యంత్రాన్ని కొట్టవలసి వచ్చింది. చరిత్రలో రుద్రమ్మ దేవిని పెళ్ళాడాలంటే ఆమెతో కత్తి యుద్ధం చేయవలసి వచ్చింది. నేడు వసంతను పెళ్ళిచేసికోవాలంటే కర్రసాముకి తయారు కావాలన్న మాట. బావ మంచి ఛలే వాడే! తరువాత....

బంగారమ్మ : వసంత కూడ ఆ అన్నకు తగ్గ చెల్లెలే కదూ! ఏ తానులో పీలిక ఆ తానుకే చెందినట్లు ఆమె కూడ అలాగే అనేది. ఈ పుల్గ్రామంతా ఇదే మాట చెప్పుకొనే వారు.

పాపన్న : ఆశ్చర్యకరమైన విషయం కావడం వలన ఆనోట, ఆనోట మొత్తం ప్రాకి పోయింది!

బంగారమ్మ : ఒక రోజున అన్నగారితో కర్రసాము చేస్తుండగా అమలు దారంటే పన్నులు వసూలు చేసే అసామి వసంతను చూడటం జరిగింది.

పాపన్న : చూస్తే. ...

బంగారమ్మ : తనతో వచ్చిన వాళ్ల ద్వారా వసంతను తనకిచ్చి పెళ్లి చేయుమని మీ బావ దగ్గరకు రాయబారము పంపించి నాడు. ఆ అమలుదారు.

పాపన్న : దానికేం! భేషుగ్గావుంది. తరువాత

బంగారమ్మ : నాకు కుల మత భేదాల పట్టింపులేదు. అమలు దారు పెళ్ళాడతానంటే అంత కంటె ఆనంద మేమున్నది? కానయితే మా వసంతని కర్రసాములో నెగ్గ గలిగిన వానికే ఇచ్చి పెళ్లి చేస్తానన్నది ఎపుడో తీసికొన్న నిర్ణయమని మీ బావ చెప్పడం జరిగింది.

పాపన్న : బావకు మాటంటే మాటే.

బంగారమ్మ : అమలు దారంతటి వాడు పెళ్ళి చేసి కొంటానంటే ఎవరు కాదంటారని అందరూ అనుకొన్నారు. కాని ఆయన ఒప్పుకోలేదు.

పాపన్న : బహాయి ఏమి బాపనమ్మా అంటే - అమలుదారు నా అల్లు డాయెగదా అని పొంగి పోయేటంతగా ఆనంద పడి పోతా రని అనుకొని ఉంటారు. బావ యొక్క జీవ లక్షణం వాళ్లకేమి తెలుసు?

బంగారమ్మ : అక్కడికీ వసంతను వదులు కోలేక ఆ అమలుదారు కర్ర పట్టుకున్నాడు.

పాపన్న : దానికీ సిద్ధపడ్డాడూ! అయితే మొత్తం మీద గట్టివాడే!

బంగారమ్మ : అమలు దారుకి బలమయితే ఉందిగాని సులువు తెలీదు. చేతిలో కర్ర బరి దాటి పోవడానికి అరగంట కూడ పట్టలేదు.

పాపన్న : అయ్యకు ఆరాటమే గాని పోరాటం తక్కువన్న మాట. ఎంత కుమిలి పోయి ఉంటాడో పాపం!

బంగారమ్మ : తరువాత గుస గుసలు, ప్రశంసలూ, ఎత్తిపొడుపులు.

పాపన్న : అవి ఎక్కడైనా మామూలే!

బంగారమ్మ : ఇలాగయితే వసంతకు పెళ్ళి కాదు; అసలు, ఆమె కెదురు గుండగా కర్ర పట్టుకొని నిలబడ గలిగిన సత్తా ఉన్న వాడేడి? పెళ్లి చేయకుండగా ఎంత కాలం ఇంట్లో పెట్టు కొంటాడు అని రకరకాలుగా చెప్పు కొనే వారు.

పాపన్న : వసంత ఏమనేది?

బంగారమ్మ : ఆమె తక్కువదా! అన్నగారి కన్నా ఆరాకు లెక్కువ చదివింది. మా అన్నయ్య మాటే నా మాట అనేది. కొందరయితే వసంతను పెళ్ళాడే వాడు మన పులగాము లోనే

లేదు అనే వారు. దానికి సమాధానంగా మీ బావగారు పుల గాములో లేకపోతే తాటి కొండలో ఉంటాడనే వారు.

పాపన్న : తాటి కొండా !

బంగారమ్మ : తాటి కొండలో ఎవరున్నారు? మీ బావమర్ది పాపన్న మొనగాడని విన్నాం. మరి అతనికిస్తే చాలా బాగుంటుంది. అతనయితే మాత్రం మన వసంత కెదురుగా కర్ర పట్టు కొని నిలబడ గలడా! అనేది సందేహమే! అని ఇక్కడి వాళ్లు అంటూ ఉండే వారు.

పాపన్న : (ప్రశ్నార్థకంగా చూడగా)

బంగారమ్మ : మా పాపన్నను రప్పించి పెద్దలందరి సమక్షంలో వారిరువురి కర్రసాము నేర్పాటు చేస్తానని చెప్పేవారు. ఇంతలో ఈ పని జరిగింది (ఏడ్చును)

పాపన్న : ఆ అమలు దారే చంపించినట్లు దాఖలా ఏమిటి?

బంగారమ్మ : మీ బావ ఎవరితోను గొడవ పెట్టుకొనే వ్యక్తి కాదు. ఆయన మీద వ్యక్తిగతంగా ఎవరికి ద్వేషము లేదు. ఆ నవాబు సైనికులు అకారణంగా చంపి పారి పోయారంటే ఆ అమలు దారు పురమాయించిన పనే కావాలి. ఎందు చేతనంటే వసంతను తన దానిగా చేసి కోవడానికి ఆయనే అడ్డని వాడు భావించి ఉండవచ్చు. ఈ వేళ ఈ అన్నెమూ పున్నెమూ ఎరుంగని తన అన్నయ్యను చంపించిన వానిని ప్రేమిస్తుందంటే ఇది మనిషా! పశువా! పాషాణమా!

పాపన్న : ఆవేశ పడకు! ఇది చాల విడ్డూరంగా ఉందే! నాకే తల తిరిగి పోతుంది. ఒకప్పుడు తనను కర్రసాములో ఓడించిన

వానిని తప్ప మరొకరిని పెళ్లి చేసికోనని భీష్మించిన స్త్రీ గారాబంగా చిన్నప్పటి నుంచి పెంచి పెద్ద చేసిన అన్నను చంపించినాడనే అనుమాన మున్న వానిని తన చేతిలో ఓడి పోయిన వానిని ప్రేమిస్తుందంటే దీనివెనుక ఏదో బలవత్తర మైన కారణ ముండి తీరాలి.

బంగారమ్మ : ఏమో! ఏం కారణమో కాని, దాని నడిగి నీవే తెల్సుకో. అదిగో వస్తుంది. చేతిలో కర్ర మాత్రం విడిచి పెట్టదు. (అని లోపలకు వెళ్లును)

వసంత : (వస్తూనే) ఎంత సేపయింది వచ్చి?

పాపన్న : ఎక్కడికి వెళ్ళావు? అమలు దారు కోసమా!

వసంత : (కళ్లెర్రచేసి) అదేమి మాట?

పాపన్న : మంచీ చెడ్డా విడిచి పెట్టేశావన్న మాట.

వసంత , ఏమిటా మంచి చెడ్డలు?

పాపన్న : ఈ అంబటికేనా ఇరవై నాలుగు నామాలు!

వసంత : కొంచె మాలోచించి మాట్లాడితే మంచిది.

పాపన్న : ఉన్న మాటంటే ఉలుకెందుకు?

వసంత : ఎంతో విశాల హృదయుడవనుకొన్నాను.

పాపన్న : కాని వారికి హృదయంలో చోటిస్తున్న నీవు విశాల హృదయువు కాని, నేను కాను,

వసంత ; నీ గురించి నేనూహించిన వన్నీ గాలి మేడలే!

పాపన్న : నేనూ ఊహించుకొన్నాను నీ గురించి గొప్పగా! ఆశలన్నీ అడుగంటి పోగా, పరువంతా గంగలో కలిపేశావు.

వసంత : (కళ్ళ నీళ్ళతో) (మౌనంగా ఉంటుంది)

పాపన్న : మాట్లాడవేం !

వసంత : నీ పరువా ! నా పరువా !

పాపన్న : రెండూని. ఇలాగయితే కర్ర పట్టుకొని ఎదురుగా నిల్చిన వాడినే పెళ్లి చేసికొంటానని ప్రగల్భాలు పలకడ మెందుకు? మీ అన్నయ్య ఉండగనే ఆ అమలు దారుని చేసి కొంటా నంటే ఇంత విపరీతం జరిగేది కాదు గదా !

వసంత : పరిస్థితులకు తల ఒగ్గ వలసి వచ్చినది.

పాపన్న : ఏమిటా పరిస్థితులు?

వసంత : ఇప్పుడు చెప్పవలసినవికావు.

పాపన్న : ఇదో వంక ! కళ్ళ కావరం, ఒంటిలో మదం పెరిగి ఇలా చేయిస్తున్నాయి.

వసంత : పాపన్నా ! ఈ మాటన్నది నీవు కాబట్టి సరిపోయింది, మరొకరయితేనా !

పాపన్న : మరొకరయితే?

వసంత : కర్రకు పని చెప్పవలసి వచ్చేది.

పాపన్న : చేస్తున్నది పనికి మాలిన పని. పై పెచ్చు కర్రకు పని చెప్పు తావా ! నీ కర్ర సత్తా నా దగ్గర పనికిరాదు. హనుమంతుని ముందు కుప్పి గంతులు వేయకు.

వసంత : పాపన్నా! నేను పరిస్థితులికి కట్టుబడిపోయి ఉండ వలసి వస్తుంది కాని లేకపోతే నా తడాఖా ఏమిటో చూపించేదాన్ని

పాపన్న : నీ తడాఖా ఏమిటో నాకు చూడాలనే ఉంది. కాని నీ ముఖం చూస్తేనే పాపం. ఇక నీతో కర్ర కలపడమా! చూడు! నీవెంతో మందిని మట్టి కరిపించి వుండ వచ్చేమో కాని నీ ప్రతాపాలు, కర్ర సత్తా నీవు తల వంచక నిజాయితీగా ఉన్నంత కాలమే. మార్గం తప్పితే నీ శక్తి సామర్థ్యాలకు తిలోదకాలిచ్చు కొన్నట్లే.

వసంత : నేను నిజాయితీగానే ఉన్నాను, మార్గం తప్పలేదు.

పాపన్న : అయితే నీ చేతలకు మాటలకు పొంతన లేదు. అమలు దారుతో ప్రేమ కలాపాలు సాగించడం దారితప్పడం కాదా!

వసంత : కాదు, పరిస్థితుల ప్రభావము.

పాపన్న : పరిస్థితులు పేరు చెప్పుకొని పబ్బం. గడుపు కోవాలను కొంటున్నావు కదూ!

బంగారమ్మ : (లోపలి నుండి ప్రవేశించి) పాపన్నా! నీ కెందుకు మాట్లాడ కూరుకో! ఊరంతా కోడై కూస్తుంది. మన నోళ్ళు మూయవచ్చుగాని లోకం నోరు మూయ లేదు కదా! పై పెచ్చు తానేమీ ఎరగనట్లు నంగనాచిలా మాట్లాడు తుంది. లోకంలో ప్రతీ వాళ్లు తాను వలచినది రంభ, తాను మునిగినది గంగ అన్నట్లు మాట్లాడుతారు. పోయిన పరువెలాగా పోయింది. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టు కొన్నా ప్రయోజనం లేదు. మన కెందుకు మాట్లాడ కూరుకో, చేయిదాటి పోయాక మనం చేయి గలిగిందేమిటి?

తనకు మాత్రం తెలీదు! చిన్నా! చిటుకా! అందరికీ తనే చెప్తుంది పెద్ద ఆరిందలాగ!

వసంత : ఏమిటి వదినా! నీవైనా మీ అన్నయ్యకు సర్ది చెపుతావను కొన్నాను. అగ్నిలో ఆజ్యం పోస్తున్నట్లు మాట్లాడు తున్నావు. మీ ఇద్దరికీ దూరమై నేను ఒరగ బెట్టేదేముంది! నన్ను గూర్చి ఎంత మంది నీచంగా మాట్లాడినా తల వంచనుగాని, మీ అన్నయ్య మాత్రం అనుమానిస్తే నేను భరించలేను. ఆయనకు దూరమై జీవించలేను.

బంగారమ్మ : చాల్చాలు. వేసిన వేషాలు చాలక ఈ నంగ నాచి కబుర్లు కూడానా!

పాపన్న : ఇంత కన్నా అమాయకుడీ లోకంలో ఎవడూ లేడను కొంటున్నావా!

వసంత :

కన్న తండ్రి కంటె కడు గారవంబుగ
పెంచి నట్టి వాని ద్రుంచి నట్టి
పరమ దుర్మదాంధు ప్రాణంబు దీయక
పెండ్లియాడ నాకు పిచ్చి కలదె.

పాపన్న : అంటే !

వసంత : నష్ట పడినా భ్రష్టకారాదు అని నాకు తెలుసు. ఇంత బ్రతుకూ బ్రతికీ ఇంటి వెనకాల పడి చచ్చినట్లు న్నా అన్నయ్యను చంపిన వాడి అంతు తేల్చక పోతే నా గొప్ప తన మేమిటి? నా చేతి విద్య నీరు కారి పోవలిసిందేనా! నేతి బీర కావలిసిందేనా! అటు వంటప్పుడు నేను బ్రతి కుండడం అనవసరం.

పాపన్న : అందుకని....

వసంత : మా అన్నయ్యను చంపిన వారెవరో నాకు తెలియదు. అయితే ఆ దుర్మార్గులు గుర్రాల మీద వచ్చారు. వెనకాల ఉండి ఈ పని చేయించి నట్లుగా అమలు దారు మీద అనుమాన ముంది. అడ్డు తీరు తుందనే ఆలోచనతో వాడే ఈ పని చేయించి ఉండ వచ్చని పించింది. అతడు తరువాత నన్ను తరచు కదిపే ప్రయత్నం చేశాడు. అది అదనుగా గ్రహించి వాడికి చేరువౌతున్నట్లు నటించి కూపీ తీస్తున్నాను.

బంగారమ్మ : వాళ్ల సన్నిధి లోనికి వెళ్లి జాగ్రత్తగా రావడం సాధ్యమా !

వసంత : మగ వాళ్లు వేగిర పడడం సహజమే కాని పెళ్లి కాకుండగా దగ్గరకు రాకూడదని అడ్డు కట్ట వేశాను.

బంగారమ్మ : ఎంతకైనా తగిన దానివే!

పాపన్న : నిజమైన బంగారము నిప్పుకు భయపడదు.

వసంత : అప్పటి నుండి పెళ్లికి తొందర పెట్టడం ప్రారంభించాడు. మా అన్నయ్య సాంవత్సరికము కాకుండగా అది కుదర దన్నాను.

బంగారమ్మ : మంచి బలే దానివే! అంగీకరించాడా !

పాపన్న : అగ్గి చూపితే వెన్న అడక్కుండా కరుగుతుంది.

వసంత : అంగీకరించక ! చెప్పు క్రింద తేలు లాగ అణచి పెట్టాను. గంగిరెద్దు లాగ నేనెలాగ ఆడిస్తే అలాగ ఆడ వలిసిందే. అదీ గాక ఆ అమలుదారు మన హిందువే కావడం

కారణంగా సాంవత్సరికము దాక ఆగాలంటే నిజమే అను
కొని నమ్మేశాడు.

పాపన్న : ఇంతకీ అసలు విషయం ఆరాతీశావా!

వసంత : తీయక! ఆ విషయం ఈ వేళే తేల్చాడు. తొందర పడ్డా
నని మొసలి కన్నీరు కారుస్తున్నా డిప్పుడు. ఆ మాట
చెప్పగానే పీక పిసికి చంపి వేయాలని పించింది. పుట్టెడు
దుఃఖాన్ని ఆపుకొని తమాయించు కొన్నాను కానీ, లేక
పోతే అంతపనీ జరిగేది. వాడెంత రహస్యంగా ఈ పని
చేయించాడో అంత కంటె రహస్యంగా, చేతులకు మట్టి
అంటుకోకుండగా వాడి పని పట్టాలను కొంటున్నాను.
అంతే కాదు; ఆ పని చేసిన వాళ్ళ పని కూడ పట్టాలి.
సమయానికి దేవుడు లాగ వచ్చావు. ఆ మార్గం నీవే
ఆలోచించాలి.

బంగారమ్మ : (వసంతను కౌగిలించుకొని) నా ఆడు బిడ్డ నెంత అను
మానించాను, అవ మానించాను. (అని ఏడుస్తూ వసంత
కన్నీళ్ళు తుడిచి లోపలకు వెళ్లును)

పాపన్న : నీ విలా ప్రవర్తించడానికి వెనుక ఏదో రహస్య ముండి
తీరు తుందను కొన్నాను కాని ఎంత పొర పడ్డాను, అసలు,
నిప్పుకు చెదలు పట్టునా!

వసంత : ఇందులో మీ పొర పాటే మున్నది. ఎవరికీ విషయం
తెలియ నీయలేదు. వదినతోనైన చెప్పితే ఎక్కడ వద్దం
టుందోనని, అప్పటి నుండి ఇల్లు కదల నీయదని రహ
స్యంగా ఉంచడం జరిగింది. దీని గురించి ఎంత మంది
చెవులు కొరుక్కుంటున్నా నాలో నేను కుమిలి పోతూనే

భరిస్తూ వచ్చాను. వెళ్ళేది కత్తుల బోనులోనికి అనే విష యాన్ని నిర్ణయించుకొనే సిద్ధపడ్డాను. కొంత వరకు సాధించాను. తక్కినది కూడ తొందరలో సాధించి ఉండే దాన్ని. కాని నీవు నన్ను అనుమానించిన పిమ్మట కూడ చెప్పక పోతే అసలుకే మోసము వస్తుందని బయట పెట్టడం జరిగింది.

పాపన్న : నీచేత అసలు సంగతేమిటో కక్కించడానికే అంత కఠినంగా వ్యవహరించవలసి వచ్చింది.

వసంత : అది సరే కాని, ఈ నా ప్రతీకార భారము తలమీది నుండి భుజము మీదికి వచ్చి కొంత తేలిక పడ్డాను. భుజము మీద భారము కూడ దింప వలసిన బాధ్యత నీది.

పాపన్న : ముల్లును ముల్లుతోనే తీయాలి!

వసంత : సమూలంగా తీయాలన్నది నా కాంక్ష.

పాపన్న : ఆ అమలు దారు, అతడు పురమాయించిన దుర్మార్గులు ఒక చోటకు చేరే మార్గం ఆలోచించాలి.

వసంత : ఒకటే మార్గం, పెళ్లి కంగీకరించాలి.

పాపన్న : అవును, అదే మార్గం. మన పులగామునకు దగ్గరగా ఉత్తరపు దిక్కున గల అరణ్యములో నున్న కాళికా దేవి ఆలయంలో వివాహ వేదిక ఏర్పాటు చేయాలి. అమలు దారును తన పరివారముతో అక్కడకు వచ్చేటట్లు అంగీక రింప జేయాలి.

వసంత : అయితే, వివాహానికి సాంవత్సరికము వరకు గడువు పెట్టి,

ఇప్పుడు హఠాత్తుగా దీని ప్రస్తావన తెస్తే అనుమానము రాదు !

పాపన్న : రాదు మరి ! తప్పకుండగా వస్తుంది. మగ వాళ్లకే ఆ నిబంధన గాని ఆడవాళ్లకు లేదని శాస్త్రులు గారు చెప్పారని చెప్పడమే చక్కని ఉపాయం. దీనికి తప్పకుండగా అంగీకరిస్తాడు. కలక వేసిన చేప వలకు రాకుండగా పోదు.

వసంత : ఎత్తుగడ బాగుంది.

పాపన్న : ఇక్కడకు హనుమంతు, కోటయ్యలు వస్తారు. వాళ్ళతో కలిసి ముసుగువేషంలో వాళ్ల భరతం పడతాం. వేరే వాళ్లని కొందరిని కూర్చుకొనైనా వాళ్లను మట్టు పెడతాను.

వసంత : వాళ్లెవరు?

పాపన్న : నా అనుయాయులు. వాళ్లను ఒకందులకు రమ్మన్నాను, ఇందుల కుపయోగ పడు తున్నారు. గోల్కొండను జయించాలనేది మా ఆశయం. దానికి డబ్బు కావాలి. ఒకే దెబ్బకు రెండు పక్షులు పడినట్లు ఒకటి మన పంతం తీరుతుంది, రెండు మాకు సైన్య సంపాదనకు డబ్బూ చేకూరుతుంది.

వసంత : గోల్కొండను జయించడమే !

పాపన్న : నీవు చెప్పిన పని జాగ్రత్తగా నిర్వహించు. తక్కిన వ్యవహారం మేము చూసుకొంటాం

వసంత : తప్ప కుండగా ! నేను చెప్పడమే తరువాయి. మారు మాట మాట్లాడ కుండగా అంగీకరింప జేస్తాను. అది సరే కాని! ఉపకారపు మొగుడు ఉండే మను విచ్చాడన్నట్లు నీ కోసం

తపించుకొని పోయే ఒక ప్రేమ జీవి ఇక్కడ ఉందనే విషయ మిన్నాళ్ళకు గుర్తు వచ్చిందా!

పాపన్న : నా కోసమా! ఎవరా ప్రేమజీవి?

వసంత : అబ్బా! ఏమీ తెలియనట్లు ఎంత బిగిసీ పోతున్నావు! నా నోటి ద్వారా చెప్పించు కోవాలను కొంటున్నావా!

పాపన్న : అబ్బే! బెట్టుసరి చేయగలిగినంత సామర్థ్య మున్నవాడినా! అసలు నిన్ను ప్రేమించేటంత ధైర్యం నా కెక్కడిది? నిన్ను ప్రేమిస్తే కర్ర పట్టుకొని నిలబడాలి! అంత విద్య నా కెక్కడిది?

వసంత : అంతేలే! నీ కంతా వెటకారంగా ఉంటుంది!

పాపన్న : వెటకారం కాదు, నిజంగా నిన్ను ప్రేమిస్తే కర్ర దెబ్బలు తిన వలసి వస్తుందని భయపడిపోయి....!

వసంత : అవునులే! అలాగే అంటావు! ఇప్పుడు తెలిసింది, నీ నిజ స్వరూపం! నీవు రాజకీయాలలో పడిపోయి నన్ను మర్చి పోయావు! నాకు తెలుసు, పదవీ కాంక్ష అటువంటిది! పైకి ఏమీ తెలియనట్లు మాట్లాడు తున్నావు.

పాపన్న : అబ్బో! నా మీద పెద్ద పెద్ద పద ప్రయోగాలు చేస్తున్నావు. నీవన్నట్లు నాకు పదవీ కాంక్ష ఉండవచ్చు. కాదనను కాని ప్రధానంగా ఈ దోపిడీలకు పగ్గాలు వేయడం.

వసంత : ఊరకే అంటున్నాను. పాట పరుస కన్నంత మాత్రాన ఉద్రేకం పడిపోవడమా!

పాపన్న : ఉద్రేకం కాదు. నా కర్తవ్యం చెప్పాను. ఇప్పు డిక్కడికి

నేను వచ్చినది గుర్రాలు కొనడానికి డబ్బుకోసం అంతే కాదు, మంచి నమ్మకస్తులైన వాళ్ళు ఉత్సాహవంతులు కావాలి.

వసంత : అంటే నీవు వచ్చింది నాకోసం కాదన్న మాట !

పాపన్న : నా ఆశయం కోసం వచ్చాను. ఆశయం నెరవేరే వరకు దేని గురించి కూడ ఆలోచించే మనస్సు కాదు నాది.

వసంత : నా ఆశ నీరు కారి పోవడమేనా!

పాపన్న : ఎందు కింత బెంబేలు పడిపోతున్నావు! నీ లక్ష్యం కోసం పులినోట్లో తల పెట్టడానికే సిద్ధపడ్డావే! అప్పుడేమయి పోయిందీ ప్రేమ? పాపన్న గుర్తు రాలేదా !

వసంత : క్షమించు. కర్తవ్య నిర్మగ్నులకు తక్కిన వన్నియు అల్ప ములే. ఏకాగ్రత అలవడిన వారికి లక్ష్యము సిద్ధించిన పిమ్మట గాని మనసు మరియొక దాని యందు మరలదు.

పాపన్న : అదీ! అలా దారికి రా ! అంతే కాదు, నీ మీద అంత ప్రేమ ఉంది, ఇంత ప్రేమ ఉంది అని అనడం అల్పుల లక్షణం. చేతలే దానికి పరమ నిదర్శనములు. పరివర్తనతో నిమిత్తం లేని ప్రేమ తాత్కాలిక మైనదే! అంటే ఏదో ప్రయోజనం కోసం వెలగ బెట్టేదే! ప్రేమ అమ్మేది కాదు, కొనేది కాదు, రాపిడి పెట్టే కొద్దీ దాని వెల పెరుగుతుంది.

వసంత : ఇంతవరకు శత్రువుని తుద ముట్టించడమే తెలుసు నను కొన్నాను. ప్రేమ గురించి కూడ బాగుగా వ్యాఖ్యానిస్తు న్నావే !

పాపన్న : అలాగని ప్రేమ పాఠాలు చెప్పమనవు గదా !

వసంత : నాతో కర్రి పట్టుకోకుండా ఎవరి దగ్గర ప్రేమ పాఠం నేర్చుకోను.

పాపన్న : ఇంతలోనే ఎంత బెట్టు సరి!

వసంత : బెట్టు సరి కాదు, పట్టుదల.

పాపన్న : అలాగ ఉండాలి పట్టుదల అంటే.

జన్మ జన్మాలకును కార్య సాధనమును
మించి నట్టిది లేదు ప్రపంచ మందు
ఆరు మూడైన గాని మూడారు గాని
చెక్కు చెదరక నడుపుము స్వీయరథము

వసంత : నా నిశ్చయానికి తిరుగులేదు.

ఉ: నన్నభిమాన సంపదల నచ్చిన మెచ్చిన విద్యయందునన్
మిన్నగ జేసి జీవన సమీకమునన్ నిలబెట్టినట్టి నా
అన్న గతించి పోయె పరమాదర కారకులైన వారు లే
రెన్నగ నిన్ను మించి, చరియింతు త్వదీయ పదానువర్తినై

వదినతో ఆలోచించి మాకున్న సంపదను ఉద్యమానికి సమర్పించు కొంటాను.

పాపన్న : అంత కంటెను నాకు కావలిసిన దేమున్నది!

వసంత : ఎవరో ఇరువు రిటే వచ్చు చున్నట్లున్నది!

పాపన్న : వాళ్ళే హనుమంతు కోటయ్యలు. సరే నీవు లోపలకు వెళ్లు. ఒక్క విషయం మర్చి పోకూడదు. అమలు దారు చేత పెళ్ళిరోజున కానుకలు రూపమున ఎక్కువ ధనము తీసి

కొని వచ్చేటట్లు చూడు. అంతే కాదు, ఇక్కడి నుండి కొందరిని మన దండులో చేరే ఏర్పాటు చెయ్యి.

వసంత : ఇంతకీ పెళ్లి ఎవరికి?

పాపన్న : ఆ రోజు రానీ! నీవే దగ్గరుండి మంగళం పాడి కట్నాం వసూలు చేయవచ్చు.

వసంత : (నవ్వు కొంటూ వెళ్లిపోవును)

హనుమంతు }
కోటయ్య } పాపన్న గారికి నమస్కారములు.

పాపన్న : మిత్రులు పద్ధతి మార్చివేశారే. మనలో మనకు నిర్మలమైన అభిమానము ఉండాలే కాని నమస్కారము అవసరము లేదు. మనము మాత్రమే ఉన్నప్పుడు ఇటువంటి గౌరవాలకు అసలే ఆస్కారము లేదు.

హనుమంతు: మీరన్నది నిజమే కాని మాలో తెలియ కుండగా స్నేహితుల మన్న భావము తగ్గి, మీరు నాయకులన్న భావము ప్రవృద్ధ మగు చున్నది.

కోటయ్య: ఏకాంతములో మెలంగిన భావమే పది మందిలో నున్నప్పుడు కూడ చోటు చేసి కొనవచ్చును. అది చూచిన వారికి మనపై తేలిక భావ మేర్పడును. కనుక ఇక నుంచి గౌరవ ప్రదముగా మెలంగుటయే మంచిది.

పాపన్న : మిత్రుల ఆత్మీయతకు నా కృతజ్ఞతలు. మన ప్రయత్నము లెంతవరకు వచ్చినవి?

హనుమంతు : తూరుపు కొండ లోయ లోనికి వచ్చి మీరిచ్చిన సందే శము మన వారిలో మరింత చైతన్యము, విశ్వాసము కలుగ జేసినది. ముఖ్యముగా తర తరాలుగా వస్తున్న ఈ దోపిడీ పరిపాలన నంతమొందించి స్వేచ్ఛావాయు వులు పీల్చుకొని స్వాతంత్ర్య పతాక నెగుర వేయాలన్న భావ మందరినీ ఆకట్టు కొన్నది.

కోటయ్య: మనం చేస్తున్నది ధర్మయుద్ధం. కనుకనే మనది ధర్మ ఉద్యమం అన్న భావము పాతుకొని పోయినది. దీని కోసం ప్రాణాలర్పిస్తే వీర స్వర్గం ప్రాప్త మౌతుంది అనే పవిత్ర భావం నాటుకొని వుంది.

పాపన్న : అయితే పుష్పించి కాయగా మారిన మన ఆశయం ఫలించ డమే తరువాయి.

హనుమంతు : మన మిప్పుడు చాలినంత అంటే దోపిడీ గాళ్లను నిరోధించగల బలగాన్ని సేకరించు కొన్నట్లే.

కోటయ్య: మన బలగాన్ని తూర్పు కొండ లోయలో నుంచి కూడ మార్చ వలసిన అవసరముంది. అది మనకు పూర్తి రక్షణకు పనికి రాదు. నవాబు కీ పాటికే మన సమాచారం తెలిసి ఉండ వచ్చని నా అను మానం.

పాపన్న : కోటయ్యా! నీవు చెప్పింది నిజం. ఇంకా ఎక్కువ కాలం తూరుపు కొండ లోయలో ఉండడం మంచిది కాదు. మనకు వీలయిన ప్రదేశము షాహ పురమున గల కొండల నాధారముగా తాత్కాలికముగా మట్టి కోటను నిర్మించు కొన వలసియున్నది. ఆ ప్రాంతానికి మన దండును మరల్చండి. అక్కడ మన ఉద్యమంలో చేరే వారున్నారు.

హనుమంతు : ఆ అరణ్య ప్రాంతానికి నవాబు సైన్యం అడుగు పెట్ట లేదు. ఒక వేళ అడుగు పెట్టినా, ఆ చిక్కు దారుల్లో మనకు చిక్కడం తప్పదు. అది బాగా అనువైన ప్రదేశం. మీ యోచన బాగున్నది.

పాపన్న : మా దుగ్గన్న బావ చెల్లెలు వసంత ద్వారా ఇక్కడి వారి కొందరిని దండులో చేర్చే ప్రయత్నాలు జరుగు తున్నాయి. మట్టి కోట కట్టు కోవడానికి షాహపురము చేరే లోపున ఇక్కడ ఒక పని చక్క బెట్ట వలసి యున్నది.

కోటయ్య: ఏమిటా పని!

పాపన్న : (అటునిటుజూచి) కొద్ది రోజుల్లో ఇక్కడి అమలు దారుపై, అతని అనుయాయులపై మనము దాడి చేయ వలసి యున్నది. అటు గుర్రాలకు, ఇటు ధనానికి కూడ సావ కాశమున్నది. ఈ పని నెరవేర్చిన వెంటనే ఒక క్షణము కూడ ఆలస్యము చేయ కుండగా మన దండుతో పాటు షాహపుర ప్రాంతానికి చేర వలసి యున్నది.

హనుమంతు : అలాగే.

(అందరు నిష్క్రమింతురు)

తృతీయాంకము సమాప్తము



# చతుర్థాంకము

(షాహపురము - రాతికోట)

(పాపన్న, అనుచరులు సైన్యముతో సమావేశము)

పాపన్న : (సైనికుల నుద్దేశించి) సోదరు యోధాగ్రేసరులారా! ఉద్యమ లక్ష్యైక సాధన తత్పరులారా! స్వాతంత్ర్య సంపాదన కార్యదీక్షా దక్షులారా! ముమ్మొదటగా మీ యందరకు కృతజ్ఞతలు. సమున్నత స్వతంత్ర భావ సముజ్జ్వల సువిశాల మనస్కులైన సైనిక సోదరులారా! మీ యొక్క బుద్ధి చాతుర్యము, కండబలముల అండ దండలు దండిగా ఉండబట్టి ఈ షాహపురమున పెట్టని కోటలుగా నున్న కొండల మధ్య అని తర సాధ్యము, శత్రు దుర్భేద్యము, దుర్నిరీక్ష్యమైన రాతి కోటను మనము నిర్మించు కోవడము జరిగినది. ఇక్కడి నుండియే మనము గోల్కొండ కోటపై దండెత్త వలసి యున్నది. అంటే మన గమ్యస్థానము కనుచూపు మేరకు మించిలేదు. (సభలో నుండి చప్పట్లు)

అయితే ఇంత వరకు ప్రాణాలకు తెగించి ఉద్యము లక్ష్యానికి అంకితమై అందరూ పోరినప్పటికి, అందరిలోను విశిష్టమైన పరాక్రమము చూపిన వారిని సన్మానించుట మన ప్రజోద్యమమును బల పరచు కొనుటయే.

ఉ: శూర కులా వతంసులును సూరి వరేణ్యులు సర్వ సత్కళా
కారులు వారి కర్హమగు గౌరవ పీఠము పొంద కున్నచో
ఏరికి నష్టమయ్యె, నిధులెన్నగ నుండియు వాడకున్నచో
దారుణ మంతకన్న కలదా! మరి దేశము వృద్ధి చెందునే!

కనుక ఇప్పుడా మహావీరుల పరాక్రమాదులను సదస్య మహాశయులకు పరిచయము చేయవలసినదిగా మన తెలగన్నను కోరుచున్నాను.

తెలగన్న: వీరాధి వీరులను మీకు పరిచయము చేయు భాగ్యము నాకు లభింపజేసి నందులకు ముందుగా మన పాపన్న నాయకులకు కృతజ్ఞతాభి వాదములు. రసజ్ఞులైన మన నాయకుల వారు వీరులను సన్మానింప బూనుట "విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్" అనునట్లుగా వీర హంవీరులైన వారికే చెల్లినది. ఏ దేశము వీర పూజల కాలవాలముగా నుండునో ఆ దేశ కీర్తి కాంతులు నలు దిక్కుల వ్యాపించుట తథ్యము. కుల మత వర్గములతో ముడిపెట్టి వీరులగు వారికి యోగ్యమగు స్థానము నీయ కున్నచో అంతకన్నా దౌర్భాగ్య ముండదు.

తే. గీ- జగతి నాదు దేశానకు సంభవించు
ఎట్టి దుర్దశ కేని దుఃఖింప గాని
చక్కనైవెల్గె మరి వన్నె కెక్క కుండు
వీరులను దల్చి నేను కన్నీరు గార్తు

వీరాధి వీరులలో మొదటగా పేర్కొన దగిన వ్యక్తి హనుమంతు. పాపన్న నాయకుల వారి బావ గారైన దుగ్గన్న గారిని చంపించిన అపాలు దారుని బందీగా పట్టుకొనుట లోను, అతని పరివారమును చీల్చి చెండాడి అశ్వములను, ధనమును సేకరించుటలోను అవక్ర విక్రమమును జూపిన వీర యోధుడు మన హనుమంతు. అందు వీరిని వీరోచితవస్తు వాహనాదులతో సన్మానింప వ నదిగా కోరుచున్నాను.

పాపన్న : మన హనుమంతు సైనిక సమీకరణములో సహకరించు టతో పాటు యుద్ధ రంగమున నాకు కుడి భుజముగా నుండి ప్రాణాలను కూడ లెక్కజేయక పోరాడి తెలగన్న చెప్పినట్లు అమలుదారు అనుయాయులను వశపరచుకొను మొదటి విజయమునకు కారకుడైన వ్యక్తిని సన్మానించుట ఎంతో ఆనందముగా నున్నది. (శాలువా కప్పి వీర ఖడ్గ మును బహూకరించి) ఇక నుంచి వీరే మన సర్వసైన్యాధి పతులు.

హనుమంతు : నిజానికి నేను సాటి వారిలో మేటి బలవంతుడినే కావచ్చు కాని కొండల వెంట పరుగు పెట్టే నా జీవితాన్ని అర్థవంతంగా మలచిన మన నాయకులైన పాపన్నగారికి సర్వధా, సర్వదా కృతజ్ఞుడను. సర్వసేనాధి పతి పదవిని నా అర్హతపై నమ్మకముంచి ఒసంగి నందులకు ధన్య వాదములు తెలుపుకొను చున్నాను.

శా : సేనాధ్యక్ష విశిష్ట నవ్య పదవీ స్వీకార సందర్భ యు
క్తానందోదిత సత్ప్రమాణమిది మత్ప్రాణ ప్రమాదంబులే
రానీ! జంకను, మీదు మిక్కిలిగ దుర్వారోద్యమ స్ఫూర్తితో
సేనా వాహిని వెంటరా నడిపెదన్ శీర్షంబు నందుండియున్

తెలగన్న: ఇక ద్వితీయ వ్యక్తి వసంత. ఈమె మన ఉద్యమమున అడుగు పెట్టుట తోనే సిరి అంటు కొనినది. వసంత కార ణంగా ఈ షాహ పురములో మొట్ట మొదట మట్టికోట కట్టడం జరిగింది. వారి కున్న సమస్త ధనాన్ని మన ఉద్యమానికి అర్పించుట కారణముగా ఆర్థికముగా నిలబడ గలిగినాము. ఈమె త్యాగము ప్రశంసనీయము. కనుక సముచిత స్థానమిచ్చి సత్కరింపవలసినదిగా కోరుచున్నాను.

పాపన్న : తెలగన్న చెప్పినట్లు వసంత గావించిన త్యాగము మనకు కోశాగారముగా పరిణమించినది. ఈ కోట మట్టి కోటగా నున్నప్పుడు మనలో కొంత మంది అజాగ్రత్త వలన నవాబు సేనాధిపతి ఖాసింఖాన్ వశమైనది. మరల దీనికి స్వాధీన పరచు కొనుటకు తల ప్రాణము తోకకు వచ్చిన ప్పుడు వసంత ప్రదర్శించిన యుక్తి పూర్వక ధైర్య సాహసములు మీరెరుంగనివి కావు. కనుక ఈమెను మా అంత రంగిక సలహా దారిణిగా నియమించు చున్నాను. (శాలువాతో సత్కారము)

వసంత : నన్నతి గారాబముగా పెంచిన మా అన్నయ్య దుగ్గన్నను చంపిన వారి భరతం పట్టడమే నా ధ్యేయంగా భావిం చాను. కాగల కార్యం గంధర్వులు తీర్చారనినట్లు చేయ వలసిన పని మన ఉద్యమ సభ్యులు నిర్వహించినారు.

కం: వెదుకం బోయిన తీగయు
పదమునకుం దాకినట్లు పట్టిన పంతం
బది నెర వేరిన పిమ్మట
ఎది యేనియు గోర దగిన దేమి జగానన్?

కనుక కృతజ్ఞతా సూచకముగా మా వదినను సంప్రదించి ఉన్న ధన మంతా ఉద్యమానికి సమర్పించు కొనుట జరిగినది.

మన నాయకులు పాపన్నగారు నా సాహసమును గూర్చి బహుధా ప్రశంసించినారు. నా ధ్యేయమును సాధించి పెట్టిన ఆత్మీయులకు (కొంచెం సిగ్గు పడుచు) శరీర ధనములను సమర్పించు కొనుట కన్న తృప్తియే

ముండును. ఇక వారు నాకప్పజెప్పిన బాధ్యతలను సక్ర మముగా నిర్వర్తించుటకు శక్తి వంచన లేకుండగా నిష్క ల్మష హృదయముతో కృషి చేయుదునని ప్రమాణము చేయుచున్నాను. (చప్పట్లు)

తెలగన్న: ఇక మూడవ వ్యక్తి పైడన్న. మనము తాటి కొండలో కోటను కట్టుటకు కారకుడైన వ్యక్తి యీయన. మనకు ఆపదలందుపయోగ పడుటకు రెండవ కోట అవసరమని నాయకుల వారికి హితోపదేశము గావించిన ఉద్యమాభి వృద్ధి కారకులు. మనసా వాచా కర్మణా నాయకుల వారిని స్వకీయ ప్రవర్తనచే మెప్పించి మన ఉద్యమమే ఊపిరిగా బ్రతుకు చున్న వ్యక్తి. కనుక ఈయన సన్మానార్హుడని నా దృఢ విశ్వాసము.

పాపన్న: ఉద్యమము ప్రారంభించిన నప్పటి నుండి నాకు తోడుగా ఉంటూ తన సర్వ స్వమును సమర్పించిన వ్యక్తి అను టలో సందేహము లేదు. తాటి కొండలో కోట నిర్మాణమున పైడప్ప చూపిన ప్రజ్ఞ ప్రశంస నీయము. ఈ అర్థ శాస్త్ర పరిజ్ఞాతకు పరమ బాధ్యతా యుత కోశాగారాధ్యక్ష పదవి నొసంగు చున్నాను. (సన్మానము - చప్పట్లు)

పైడప్ప: తెగిన గాలి పటము వలె గాలికి కొట్టుకొను పోవుచున్న నా జీవితాన్ని ఇంత విలువైనదిగా తీర్చి దిద్దిన పాపన్న నాయకులవారికి నా ప్రణామములు. ఎంతో విశ్వాసముంచి నన్ను కోశాగార అధ్యక్ష పదవి యందు నియోగించి నందులకు ప్రత్యుపకృతిగా నిష్కళంకముగా, నిస్వార్థ ముగా నుండుటయే కర్తవ్యము.

ఉ: నేను ధనంబు కోస మవినీతికి పాల్పడ యుష్మదీయవి
త్తాన లభించు వేతనము తప్ప గ్రహింపని కొక్క పైసయున్
మానము నమ్మివేసి యభిమానము తాకటుపెట్టి డబ్బుకై
దీనుడ గాను మీరలిక దీని ప్రమాణముగా గ్రహింపుడీ!

తెలగన్న: (మాటలాడుట కుపక్రమింపగా)

పాపన్న: (తెలగన్నను వారించి) మరియొక తీవ్ర విషయము తప్పని సరియై ప్రస్తావించవలసి వచ్చుచున్నది. ఇచ్చట అంటే షాహపురమున మట్టి కోట యున్నప్పుడు కోట పరిరక్షణకు కొంత దండుతో కోటయ్య నుంచి మేము తాటికొండలో కోటను కట్టుటకు వెళ్ళుట మీ అందరకు తెలిసిన విషయమే. కాని ఖాసింఖాన్ పన్నిన ఉచ్చులో పడి మద్యపానమునకు వశుడైన కోటయ్య కోటను చేజార్చుట జరిగినది. చిలుకను పెంచి బావురుగానికి అప్పజెప్పినట్లున్నది. మన వ్యసనమే మనకు దారుణ శత్రువు. దీనికి వశుడైన వ్యక్తి తిరిగి కోలుకొనుట ఉండదు. మొదట మద్యమును మన కోసము పుచ్చుకొంటే, తరువాత దాని కోసము బ్రతుకవలసి వచ్చును. యీ త్రాగుడే మన కోట ఆ ఖాసింఖాన్ వశమగుటకు కారణమైనది. యీ కోటను మనము మళ్ళీ స్వాధీన పరచుకొనుటలో యీ మధ్య మన యుద్యమములో చేరిన ఆలీ మహమ్మదు వంటి గొప్ప యోధులను కోల్పోవడము జరిగినది. వారందరికి మీ సమక్షమున నా జోహారు లర్పించుచున్నాను. మీ అందరి సహకారమున ధ్వంసమయిన మట్టి కోట స్థానమున రాతి కోటను నిర్మించుకొనుట జరిగినది. అయితే యీ నష్టమునకు కోటయ్య తగిన శిక్ష అనుభవింప వలసియున్నది. ధర్మాను స్థానమున దాక్షిణ్యము

నకు తావులేదు. కనుక కోటయ్యకు తగిన శిక్షను మీరే నిర్ణయించండి. (సభ అంతా నిశ్శబ్దము).
(సభను కలయ జూచి) సరే నాదొక తీర్పు. కోటయ్య తనకే శిక్ష విధించు కొనిన అదియే అమలు జరుగును. (అని కోటయ్య వంక జూచును).

కోటయ్య: సోదర సభ్య మహాశయులారా! అసలే పశ్చాత్తాపముతో క్రుంగి పోవుచున్న నాపై శిక్ష విధించు కొను భారము మోపుట పుండుపై కారము జల్లునట్లుగా నున్నది. నాకిట్లు జరుగ వలసినదే. చేసిన తప్పునకు తగిన శిక్ష అనుభవించిన గాని నామనస్సు తేలిక పడదు. కొండరుద్యమ రథ సారథులు దుర్గ నిర్మాణమునకు తాటికొండ వెళ్ళునప్పుడు ఈ షాహపురమున గల మట్టి కోటకు నన్ను రక్షకునిగా పాపన్న నాయకుల వారు నియోగించినారు. కాని నా విధి నిర్వహణలో త్రాగుడునకు బానిస నగుటచే కోట అన్యాక్రాంత మైనది. త్రాగిన మైకములో ఖాసిం ఖానునకు బందీలుగా చిక్కితిమి. అదృష్టము బాగుండి పాపన్న నాయకుల వారి శక్తి యుక్తుల కారణంగా మిమ్ములను మరల చూచే భాగ్యం లభించినది. ఈ దుస్థితికి మూల కారణము మద్యపానమే. యీ మద్యపానము వలనే నా సామర్థ్య మంతయు గంగలో కలిసి పోయినది. కొంత మంది యోధులను గూడ కోల్పోవుట జరిగినది. కనుక నాకే శిక్ష విధించినను అది అల్పమే అగును. యీ వ్యసనము నుండి దూర మగుదునను నమ్మకము నాకు లేదు. దీని ప్రభావ మట్టిది. ముందు మద్యమును మానవుడు సేవిస్తే ఆ తరువాత మద్యమే మానవుడిని సేవిస్తుంది.

అదియును గాక లోకములో త్రాగుబోతు మాటలకు విలువ లేదు. అటువంటప్పుడు నాకు నేనుగా ఏ శిక్ష విధించుకొన్నను తృప్తియుండదు. కనుక మన నాయకుల వారే తగిన శిక్ష ప్రకటింతురని వేడుకొనుచున్నాను.

పాపన్న : చేసిన తప్పు ఒప్పుకొనుటయే ఆత్మ శుద్ధికి ప్రథమ నిదర్శనము. నాకు చేదోడు వాదోడుగా నున్న కోటయ్య వ్యక్తిగతముగా ఉత్తముడు. అన్నింటిని మించి గొప్ప యోధుడు. మన యుద్యమము ఊపిరిగా బ్రతికిన వ్యక్తి. అంతటి వానిని త్రాగుడింత పని చేసినది. నిజానికతడు త్రాగుబోతే కాని మన ఉద్యమ ద్రోహికాడు. అతని పరాక్రమము మన యుద్యమమున కెప్పుడూ అవసరమే. అట్లని శిక్ష విధింపకుండగా విడిచిపెట్టుట సమంజసము కాదు. తాత్కాలిక ఆత్మ హత్య వంటిదగు త్రాగుడు అందరికిని ప్రాకిపోయే ప్రమాద మున్నది. గనుక కోటయ్యకు శిక్ష విధింప వలసినదే. నా ఆత్మీయుడైన కోటయ్యను శిక్షించుట యనగా నన్ను నేను శిక్షించుకొనుటే. అయినను నిష్పక్షపాతముగా, నిర్దాక్షిణ్యముగా తీర్పు చెప్పవలసి యున్నది. (కొంచెం సేపు కళ్ళు మూసి కొని)

ఆట పాటలు మొదలిడు నాటి నుండి
కష్ట సుఖముల విడువక కలిసి మెలిసి
ఉద్యమంబునకై తన నుసురు నీయ
సిద్ధపడు సహచరుని శిక్షించు టెట్లు

(మరల కళ్లు మూసికొని) - (కళ్లు తెరచి)

కోటయ్య హృదయమును మనము శంకింప వలసిన పని లేదు. కనుక ఉద్యమ కార్య కలాప సమయము లందు తప్పు తక్కిన వేళయందు బంధింపబడు చుండును. ఇట్లగుట వలన ఉద్యమ సేవా నిరూపణకు చక్కని అవ కాశ మిచ్చి నట్లగును. మీదు మిక్కిలి అతనిని శిక్షించు టయు జరుగును, శక్తి యుక్తులు మనము ఉపయోగించు కొన వచ్చును. నా అధీనములో ఏ వ్యక్తి శక్తి సామర్థ్య ములు వృథా పోరాదు. (సభలో నుండి చప్పట్లు)

తెలగన్న: మనల నందరిని ఉద్యమాభి ముఖముగా నడిపించిన నాయకులు, తమ తాతల నాటి సంపద నంతా ఉద్యమానికి వెచ్చించిన త్యాగ ధనులు, లక్ష్య సాధనకై ఇంద్రియము లను జయించి సర్వ సుఖములకు దూరులైన కార్య శూరులు, జీవితము నందే గాక యుద్ధ భూమి యందును మొక్క వోని పోరాట పటిమను ప్రదర్శించిన మన పాపన్న నాయకుల వారికి సదస్యుల సమక్షమున సరి యైన బిరుదు సమర్పించుట సమంజసముగా నుండునని నా నిశ్చితాభిప్రాయము. (సభలో నుండి చప్పటులు) (పాపన్న తల నడ్డుగా నూపును) (సభలో నుండి బిరుదు నీయవలసినదే అని కేకలు)

పాపన్న నాయకుల వారి యోధ గుణ ప్రధాన లక్షణ మునకు ప్రతీకగా ' సర్దార్ ' అను బిరుదు సర్వ విధముల సముచితముగా నుండునని నా అభిప్రాయము.

(సభలో నుండి సర్దార్ పాపన్నకు జై అని మూడు సార్లు నినాదములు).

హనుమంతు : జయ్ సర్దార్ పాపన్న పేరు చెప్పితే
జయ్ సర్వాయి పాపన్న పేరు చెప్పితే
నెల్లూరు బస్తీలు వణుకు
బందరు బస్తీలు వణుకు
కడప జిల్లా వణుకు
గోల్కొండ బస్తీ వొణుకు
గోల్కొండ నవాబు వణుకు
జయ్ సర్దార్ పాపన్నకు జై
జయ్ సర్దార్ పాపన్నకు జై

తెలగన్న : అసమాన ప్రావీణ్య మాయుధ విద్యల
సాధించె నిత్యంబు శ్రమకు నోర్చి
సామాన్య జనులను సాయుధ దళముగా
ఉద్యమింపగ జేసె ఒకటి కాగ
ఉద్యమ వృద్ధికై ఉన్న సంపద నంత
సర్పించె ప్రజల సౌఖ్యంబు గోరి
కోటల కట్టగా కొట్టగా ప్రతిభా స
ముదుగ్రడ తండను ముద్ర పడగ

ఒక్క సామాన్య వ్యక్తి ఇట్లుద్య మించి
కుల మతాల భేద రహిత గుణము బట్టి
జనుల కుచితంపు పదవుల నొసరనిచ్చి
ఏలు సర్దారు పాపన్న కెవరు సాటి?

పాపన్న : అందరి చేతను సక్రమముగా ఉద్యమింప జేసి ఏక
తాటిపై నడుపుట గొప్ప విషయమే, కాదనను కాని మీర
లందరు ఉద్యమాంకిత భావముతో కృషి యొనర్చుటయే

విజయ సోపాన పరంపర క్రమముగా నధిరోహించుటకు పూల కారణము. అయితే మనము సాధించిన దాని కంటే, సాధింప వలసిన కార్యమే ఘనమై యున్నది. మనకు చేరువలో నున్న ఆ లక్ష్య సాధనకు మీరందరు మరింతగా ఉద్యమింప వలసియున్నది. నేటి మన సభా కార్యక్రమములో కోటయ్యకు శిక్ష విధించు విచారమున మునిగి ఒక ముఖ్య విషయమున ఏమరుపాటు పొంది యుంటిని. (మొదట తెలగన్న వంక చూచి పిమ్మట సభనంతా కలయ జూచి)

నేనీ ఉద్యమ సారథ్యమును వహించుట యందు పరాక్రమము నందే కాక పర్యాలోచన యందును సహాయ పడిన తెలగన్న ఉద్యమ సేవ సువర్ణాక్షరముల లిఖింప దగి యున్నది. అతనికి మన ఆస్థాన కవి పురోహిత పదవుల నిచ్చి గౌరవించు చున్నాను. (సభలో చప్పట్లు)

తెలగన్న: (కన్నీళ్ళు పెట్టుకొని) చిన్న తనంలో కూని రాగాలు తీసి కొంటూ నా హృదయము స్పందించిన ప్రతీ ఘట్టమును గూర్చియు, పరవశించిన ప్రతీ దృశ్యమును గూర్చియు నోటికి వచ్చినట్లు పాడుకొంటూ నిర్దిష్ట లక్ష్యము లేక ప్రయాణించు చున్న నా జీవన రథమునకు గమ్యస్థానమును నిర్దేశించిన మన నాయకులు సర్దార్ పాపన్న గారికి కృతజ్ఞతా పూర్వక నమోవాకములర్పించు చున్నాను

ఈ అనంత కాలములో, ఈ సువిశాల లోకములో మీ వంటి సహృదయుల సాహచర్యము లభించుట నా పూర్వజన్మ సుకృతముగా భావించు కొను చున్నాను. (సభలో చప్పట్లు)

సర్దార్ పాపన్న గారు నాకు ఒకటి ఆస్థాన కవి పదవిని, మరొకటి ఆస్థాన పురోహిత పదవి నొసంగి యున్నారు. నిజానికి నేనా రెండు పదవులకు తగిన వాడను కాక పోయి నప్పటికిని సముచితార్హత సంపాదనకై నిరంతర కృషి గావింతునని మీ అందరి ముందు ప్రణామ యుక్త ప్రమాణమును చేయు చున్నాను.

ఉ: ఖండన పండితుండు పరిపాలన దక్షుడు దానవీర మా
ర్తాండ తనూజు డార్త జన రక్షణ తత్పర బుద్ధి శాలి, గో
ల్కొండ జయించి తక్తుపయి కూర్చొన గోరిన పాపనార్యును
ద్దండ చరిత్ర పద్య కవితా మృదురూపకమై వెలుంగుతన్
(సభలో చప్పట్లు)

పాపన్న : మన తెలగన్న కవీంద్రుని ప్రశంస పూర్వకమైన ఆశం సను ఆశీర్వచనముగా భావించు చున్నాను. మన ఉద్యమ చరిత్ర భావి కాలమున పద్య నాటక రూపముగా రావా లనీ ఆకాంక్షించిన కవిగారి వాక్కును దైవ ప్రసాదముగా భావించు చున్నాను. మన ఉద్యమ వ్యక్తులలో సమ్మా నార్హులైన వార లింకనూ అనేకు లున్నారు. ఇక మన భవిష్యత్ కార్యక్రమమైన గోల్కొండ ముట్టడి సమయ మున తమ విశిష్ట ప్రతిభను ప్రదర్శించి మాచే సముచిత సత్కారమును పొందుటకు కృషి చేయుదురని నా విశ్వా సము. ఇప్పుడు గోల్కొండను ముట్టడించుటకు మన మను సరించదగిన వ్యూహమును గూర్చి సేనాధిపతి హనుమంతు వివరించును.

హనుమంతు : మన మీ రాత్రికే దండెత్తుట సముచితముగా నుండు నని నా తలంపు. మొహరం పండుగ సందర్భముగా

గోల్కొండ సైన్య మంతయు రక్షణ విషయమై ప్రమత్త ముగా నున్నట్లు వార్తలందినవి. కోటకు మూడు వైపుల ఒక్కుమ్మడిగా చుట్టు ముట్టుట అవశ్యకర్తవ్యము. మనము ఏక ముఖముగా బయులు దేరి పట్టణ సమీపమున మూడు దళములుగా విడి పోవలసియున్నది. ఒక దళమునకు సర్దారు పాపన్న నాయకుల వారు, రెండవ దళమునకు పైడప్ప తెలగన్నలు, మూడవ దళమునకు నేను నాయ కత్వము వహించుట సముచితముగా నుండును. ఆసహాయ శూరులైన పాపన్న నాయకుల వారివెంట కోటయ్యు ఉండును.

పాపన్న : ఉద్యమ సోదరు లారా! కార్యోన్ముఖ మనస్కు లారా! హనుమంతు చెప్పినది మిక్కిలి సమంజసముగా నున్నది. గోల్కొండ నవాబునకు మన సైన్య మెంత యున్నదో తెలియ కుండగా నుండ వలె నన్నచో హనుమంతు చెప్పిన దే సరియైన మార్గము. కోటలో నుండి పారి పోయెడి వారికి అవకాశ మీయవలెను గాన కోటను మూడు వైపుల నుండియే ముట్టడించుట మంచిది. అట్లు గాకుండగా నాలుగు వైపుల నుండి దండెత్తినచో కోటలోనున్న వారు పారి పోవుటకు అవకాశము లేక ఎట్లైనను ప్రాణములు పోవునని తెగించి పోరాడే ప్రమాద మున్నది.

హనుమంతు : పైడప్పా!

పన్నెండు వేల దండు రాణువను వెంబడి దోడ్కొని
గోల కొండ యుద్ధానికే ప్రయాణము కావాలి
పన్నెండు కొప్పెర్ల ధనమునైన దండుకు పంచాలి
దండు దళమునే తీసికొనిగా ప్రయాణము కావాలి
ఈటె చువ్వల బారు ముందుగ తర్లుతు వుండాలి

కత్తి కటారు బారు దానినైన వెంబడించాలి
గోల్కొండకి అర్ధరాత్రికే మనము చేరుకోవాలి

పైడప్ప : యుద్ధానికి ముందు సైన్యానికి ధనము నొసంగుట యుక్తము కాదు.

హనుమంతు : పైడప్పా ! కారణం ?

పైడప్ప : వారి ఏకాగ్రతకు భంగము వాటిల్లును.

హనుమంతు : కాదు, ఉత్సాహ హేతువు.

తెలగన్న: తాళికోట యుద్ధమున యుద్ధభూమిలో సైన్యాన్ని ఉత్సాహ పరచుటకు అళియ రామ రాయలు రత్న రాసులను విర జిమ్మి భంగ పడిన విషయము మనము కర్ణా కర్ణికగా వినియున్నాము కదా ! చరిత్ర చెప్పిన గుణ పాఠము మరువరాదు.

హనుమంతు : అంటే !

తెలగన్న: రామ రాయలు యుద్ధరంగమున తన సైనికుల నుత్సాహ పరచుటకై పౌరుషము కనబరిచిన శూరులకు వారి వారి శౌర్యము యొక్క యోగ్యతను బట్టి బహుమతి లొసంగి నాడు.

హనుమంతు : రామరాయలు భంగ పడుటకు హేతువు యుద్ధ భూమిలో బహుమతులు పంచుట కాదు.

తెలగన్న: దాని ప్రభావ మెట్లు దారి తీసెనో మనకు పూర్తిగా తెలియదు.

పాపన్న : వారి సైన్యము వేరు. మన సైన్యము వేరు. మన వారం దరు ఉద్యమాశయమునకై అంకితమైన వ్యక్తులు.

గోల్కొండను జయించడమే మన ఆశయము గాని బిరుదులు రత్నరాసులు గావు.

తెలగన్న: యథార్థ విషయమును వక్కాణించినారు.

పాపన్న: ఆశయ సాధనకై ఆరాట పడుచున్న యుద్ధ విశారదులార! నేటికి మనము మన మహదాశయ మైన గోల్కొండను జయింప బోవు చున్నాము. మన ఆశయము సిద్ధింప బోవు చున్నది. మన వారి నెందరినో బందీలుగా జిక్కిన వారిని విముక్తి గావింప వలసి యున్నది. ఆ కిరాతకుల దుర్మార్గ చర్యలచే అట్టుడికి పోయినట్లుడికి పోయిన మన శరీరము లందలి కవోష్ణ రక్తము లోని వేడిమి వాడిమి చూపి మన పెద్దలకు జరిగిన అన్యాయమునకు ప్రతీకారమును దీర్చుకొని ఋణ విముక్తులము గావలసి యున్నది.

ఈ సందర్భమున నాదొక చిరు కానుక.

తే. గీ– మొదట గోల్కొండ కోటపై బురుజు నెక్కి
అస్మదీయ జయ పతాక నచట నెగుర
వేయు వానికి వీర హంవీరు డనుచు
వేయి నూట పదారుల నీయఁ గలను.

హనుమంతు: సోదర యోధాగ్రేసరు లారా! మనలో ప్రతీ ఒక్కరు మన నాయకులు సర్దారు పాపన్న గారు ప్రకటించిన బహుమానమునకై ప్రయత్నించాలి. మన వీరత్వమును చాటు కొనుట కిదే సదవ కాశము. మనం పౌరుషం చూపినప్పుడే దైవం అనుకూలిస్తుంది. తెల్లవారితే మన ఆశయ సూర్యుడు మన లలాటముపై ఉదయించక మానడు. మన

పతాక గోల్కొండ కోటపై రెపరెప లాడాలి. మనం చరిత్ర సృష్టించాలి. చరిత్రలో శాశ్వతంగా నిలిచి పోవాలి. జై సర్దారు పాపన్నకు, జై ఉద్యమ వీర సోదరులకు జై.

పైడప్ప: సర్దారు పాపన్న పేరు చెప్పితే | తక్కిన వారు
సర్వాయి పాపన్న పేరు చెప్పితే | వంత పాడుదురు.
నెల్లూరు బస్తీలు వణుకు
బందరు బస్తీలు వణుకు
గోల్కొండ బస్తీ వణుకు
గోల్కొండ నవాబు వణుకు
జయ్ సర్దార్ పాపన్నకు జై
జయ్ సర్వాయి పాపన్నకు జై

తెలగన్న: సర్దారి పాపన్న సైన్యంబు తోడ
చక చకా ముందుకు సాగు తుంటేను
గోల్కొండ కోటయే కూలు చున్నట్లు
గోల్కొండ సైన్యంబు గొల్లుమంటుంది
ఖాను నవాబైన కాళ్ళీడ్చు కొంటు
పారి పోవక పోడు ప్రాణ రక్షణకు
సర్దారి పాపన్న సైన్యంబు తోడ
చక చకా ముందుకు సాగుతుంటేను
జై సర్వాయి పాపన్నకు జై
జై సర్దార్ పాపన్నకు జై.

(అందరు నిష్క్రమింతురు)

(చతుర్థాంకము - సమాప్తము)

---

# పంచమాంకము

తెలగన్న: హనుమంతూ! హనుమంతూ!

హనుమంతు: ఏమిటి తెలగన్నా! చాలా ఆందోళనగా ఉన్నావు!

తెలగన్న: ఆందోళన కాక ఏమిటయ్యా! ఏడు రోజులు హోరా హోరీగా పోరి మనం గోల్కొండను జయించామన్న మాటేకాని ఆ సంతోషం లేకుండా పోయింది.

హనుమంతు: నిజమే! ఏమి చేస్తాం చెప్పు. మన నాయకులు సర్దార్ పాపన్నగారు ఆవిచారం నుండి ఇన్నాళ్ళూ కోలుకో లేదు.

తెలగన్న: మనతో కలసి పెరిగిన వ్యక్తి, ఉద్యమానికి అంకితమైన వ్యక్తి ..

హనుమంతు: అందుచేతనే ఇంతవరకు గోల్కొండను జయించిన విజయోత్సాహము కూడ జరుపనే లేదు.

తెలగన్న: గోల్కొండ దక్కింది కాని ఉద్యమానికి కొండంతటి అండయైన వ్యక్తిని కోల్పోయి కూడ....

హనుమంతు: అవును, పోయిన వాళ్ళతో పోలేము కదా!

తెలగన్న: అందు చేతనే సర్దార్ పాపన్న నాయకుల వారు ఇన్నాళ్ళకు తేరుకొని మన ఇరువురిని దగ్గరుండి ఉద్యమ వ్యక్తులందరూ సమావేశ మయ్యే టట్లు సభనేర్పాటు చే యండన్నారు.

హనుమంతు: తేరుకోక తప్పదు కదా! సాహస కార్యాలలో ప్రాణాలు గణింపబడవు సరే, ఇంతకూ సభా విశేషాలు గూర్చి ఏమైనా వివరాలు తెలియ జేశారా!

తెలగన్న: పైడప్ప గురించి ప్రధాన విషయంగా జెప్పారు.

హనుమంతు: అయితే, సాయంత్రానికి అన్ని యేర్పాట్లు చేద్దాం, రా! (తెరపడును, తెరలేచును)

(గోల్కొండ సింహాసనముపై పాపన్న కూర్చొనియుండును)

పాపన్న: ఓ ఆశయ సిద్ధులారా! ఉద్యమ సోదరులారా! మనము గోల్కొండను జయించి వారము రోజులై నప్పటికి నేటి వరకు సమావేశము కాలేక పోయినాము. కొడితే గోల్కొండ కొట్టవలెననిన మన ఆశయము సిద్ధించినది. ఆశయ సిద్ధి కోసం పోరాడిన వీరు లందరికి నా కృతజ్ఞతాభి వందనములు. ఏ ఫలము నాశించి మన మింత వరకు నుద్యమించితిమో అది సాధించు కొంటిమి. అయితే విజయ సౌభాగ్య మనుభవింపవలె నన్నచో దానిని సుస్థిరము చేసి కొనుటకు మరింత శ్రమించ వలసియున్నది. శత్రువు మనపై ఎప్పుడైన విజృంభింప వచ్చును. శత్రు నిశ్శేషము గావించు కొనువరకు మనము పామున్న ఇంటిలోనున్నట్లే. కనుక ఏ మరుపాటు తగదు. (అని తెలగన్న పంక జూచును)

తెలగన్న: ఈ శుభ సందర్భములో పగటివేళ మబ్బుల వలె మనల నందరిని ఒక విషాదచ్ఛాయ కప్పి యున్నది. కోట దక్కినన్న సంతోషము కన్న మన ఉద్యమ కార్య కర్త కోశాధి కారియైన పైడప్పను కోల్పోయిన బాధ అందరినీ దహించి వేయుచున్నది. మీదు మిక్కిలి మన నాయకులు సర్దార్ పాపన్న గారికి పైడప్ప మరణము పిడుగు పాటైనది. ఈ హేతువు చేతనే నేటి వరకు సమావేశము కాలేక పోయినాము.

హనుమంతు : మన ఉద్యమం ప్రారంభము నాటి నుండి తన సర్వ
స్వము ధార పోసిన సహచరుని కోల్పోయి నప్పుడు
దుఃఖి తుల గుట సహజము. అయితే మన నాయకుల
వారు గోల్కొండను జయించిన ఆనందోత్సవములో
కూడ స్నేహితుని కోసము విల విల లాడి పోవడ మనునది
సహచరుల పట్ల ఆయనకు గల అభిమానమును వ్యక్తము
చేయు చున్నది.

ఉ : ఆటలి నాటి నుండి యము యాతన లెన్నిటినో భరించి జం
జాటము జోలికేగక ప్రజా సుఖమే పరమార్థమైన పో
రాటము లక్ష్యమై తనను రాజును జేయుగ బూను మిత్రునిం
గోటను గెల్చు నాజి బలి గొన్న విషాదము గుండె గోయదే!

తెలగన్న : లోకంలో కొందరి జీవితాల త్యాగాల వల్లనే గొప్ప గొప్ప
కార్యాలు సాధించ పడ్డాయి. ఆ నిస్వార్థ సేవా తత్పరుల
జీవనాన్ని అలవరచు కోవడం ద్వారా మనం కూడ గొప్ప
వాళ్ళ మయ్యే అవకాశముంది. వారు పయనించిన బాటలో
పయనించడమే వాళ్ళ ఋణం తీర్చు కోవడం.

తే. గీ- ఉద్య మంబున కర్పించు ఉడుకునెత్త్రు
చిందు ధారుణి, ఊషరక్షేత్ర మవద
టన్న వాక్కును మనము పైడన్న ననుస
రించి నిత్య సత్యంబు గావింపవలయు

పాపన్న : విషాదానందము లొకటి కొకటి నెట్టుకొని వచ్చు చుండును.
ఈ లోకము తీరే యింత. కనుక ప్రయత్నము మాత్రము
మన వంతు. దాని ఫలితము మన కతీతము. అందుచేతనే
జయాపజయముల రెండింటికి ముందే సంసిద్ధులు కావ
లెను. అట్లని పురుష కారమునకు ప్రాధాన్య మిచ్చుటలో
వెనుకాడరాదు. (అని తెలగన్న వంక జూచును)

తెలగన్న: ఆడి తప్పని వారు సర్దార్ పాపన్న నాయకుల వారు. మనము గోల్కొండపై దండెత్తుటకు ముందు వారు పలికిన వాక్య మిచట ప్రస్తావించ వలసి యున్నది.

తే. గీ- మొదట గోల్కొండ కోటపై బురుజునెక్కి
అస్మదీయ జయ పతాక నచట నెగుర
వేయు వానికి వీర హంవీరు డనుచు
వేయి నూట పదారుల నీయ గలను

ఇప్పుడీ గోల్కొండ కోట బురుజుపై ప్రాణాలకు తెగించిన వీరావేశముతో మన జయ పతాకను ప్రతిష్ఠించిన వ్యక్తిని బిరుదు పూర్వకముగా సన్మానింప దలంచినారు. వీరుల నారాధింపని జాతికి మనుగడ లేదని సర్దార్ పాపన్న గారి నిష్కర్ష వాక్యము.

పాపన్న: ఇంత విషాదమును గూడ మైమరపించు సంఘటన ఒకటి మీలో కొంత మందికి తెలిసినదే.

ఉ: కోటను మద్య పానమునకున్ బలియై చెయి జార్చినట్టి యా
కోటయు మద్య పానమునకున్ వెలియై తన యుక్తితోడ పో
రాటము సల్పి బుర్జున పరాక్రమ చిహ్న పతాక నిల్పె ఈ
పాటికినైన తాగుబోతు వచ్చుననర్థము స్పష్టమైనదా!

ప్రాణములకు తెగించి సాహసముతో పనిచేసి నప్పుడు ఓటమి కూడ గెలుపుగా మారు ననుట కిదియే ప్రజల నిదర్శనము.

తాగుడుకు లోనై షాహపురము కోటను నవాబు సేనాధిపతి ఖాసింఖాన్‌కు చేతులార జార బెట్టిన కోటయు నేడు గోల్కొండ కోట బురుజుపైకి శత్రు సైన్యమును

ఛేదించు కొని పోయిన సాహసమును కన్నులార జూచిన వాడను. మన మందరము ప్రాణాలకు తెగించి పోరిన వారమే. కాని కోటయ్యకున్న శక్తియుక్తులు అపరిమితములు. ప్రజ్ఞాయుతమైన శౌర్యమతనిది. క్షోభ ననుభవించిన అట్టి వ్యక్తి తెగిస్తే ఎదురేమిటి? అతడు మన పతాకను బురుజుపై ఎగుర వేయగానే కోట మన స్వాధీనమై పోయినదని శత్రు సైనికులు కాలికి బుద్ధి చెప్పినారు. దానితో మన మనుకొన్నంత కష్టము లేకుండగానే కోట వశమైనది. అతడు శత్రు సైన్యమును ఛేదించుకొని పోవునప్పుడు నా వెంటనే ఉన్న వసంత ఆ దృశ్యమును ప్రత్యక్షముగా జూచినది.

వసంత : ఆ సమయములో కోటయ్యను చూస్తుంటే భారత యుద్ధములో పద్మ వ్యూహమును చొచ్చుకొనిపోవు అభిమన్యుడు గుర్తుకు వచ్చినాడు. అయితే అభిమన్యుడా వ్యూహమునకు బలై పోయినాడు. కాని కోటయు మాత్రము కోటపై నుండి మరగ కాగిన నూనె పడుచున్నప్పటికి దానిని లెక్క జేయక లగ్గ దింపు సైతము తప్పించు కొనుచు కోటపై కెక్కి చేతి కందిన వారిని తెగ నరుకుచు పోవునప్పుడు ఒక పాపన్న నాయకుల వారు తక్క అస్మదాదు లెవ్వరును వెంట వెళ్ళుటకు శక్యము గాక పోయినది. అతని వీరావేశము ముందు శత్రు సైనికులు దుముదారుగా వచ్చినప్పటికి తట్టుకొనలేక పలాయనము చిత్తగించిరి.

పాపన్న : కేవలము పతాకను బురుజుపై పాతుటే కోటయ్య లక్ష్యముగా పెట్టుకొన లేదు. నిజానికతడట్లే చేసినచో ఉద్యమ లక్ష్యము కన్న స్వార్థమున కెక్కువ ప్రాధాన్య మిచ్చి

నట్లగును ఎవరయితే తన కుటుంబము కోసము తన జీవితమును, తన గ్రామము కోసము తన కుటుంబమును, తన దేశము కోసము తన గ్రామమును త్యాగము చేయ గలరో వారే నిస్వార్థ పరులు. బహుమానము కోసము కోటయ వెంపర్లాడ లేదు. ముందుగా కోటలోనికి ప్రవే శించి కోట తలుపులు తెరిచి బురుజు పైకెగ బ్రాకినాడు. నేడు కోటయ సప్త వ్యసనములలో ప్రమాద కరమైన త్రాగుడునకు దూరమైన వ్యక్తి. త్రాగుట వలన కలుగు నష్టమును గుర్తించిన వ్యక్తి. అతనిలో వ్యక్తిత్వము మేలు కొన్నది. మీదు మిక్కిలి ఆ వ్యక్తిత్వమును చాటు కొనుటకు అవకాశము చిక్కినది.

హనుమంతు: నేను కూడ పతాక ప్రతిష్ఠాపన ప్రథమ త్వమునకు కృషి చేసిన వాడనే. కాని మా ప్రక్కన కోట తలుపులే తెరువ లేక పోయితిమి. కోట బురుజుపై మన పతాకను జూచిన శత్రు సైనికులలో నిరుత్సాహము, మన వారిలో ఉత్సాహము ప్రబలినవి. నిజానికి గోల్కొండ కోటను జయించ గలిగా మంటే కోటయ్య లగ్గ పట్టే కారణము.

తెలగన్న: కోటయ్యకు ఇంతకు ముందెప్పుడో గుర్తింపుకు రావలసిన శక్తి యుక్తులున్నవి. కాని సప్త వ్యసనములలో బలవత్తరమైన మద్య పానమును దాక్కి వేసినది. భవిష్యత్తులో దాని జోలికి వెళ్ల కుండగా మన ఉద్యమానికి జీవితాంత మంకితమై నాయకుల వారికి చేదోడు వాదోడుగా ఉండు నని నా తలంపు.

పాపన్న: మనము కోటయ్య హృదయాన్ని శంకించలేదు. శంకించి నది అతని వ్యసన బానిసత్వాన్ని. కోటయ్య మద్య పాన

వ్యసనము నుండి బయట పడుట చేతనే అతని శక్తి సామర్థ్యములు వ్యక్తము లయిన దనుట స్పష్టము. అట్టి వ్యక్తిని "వీర హంవీర" బిరుదుతో సన్మానించుట సము చితము.

(తెలగన్న అందించిన సత్కార ద్రవ్యము నందుకొని) కోటయ్యకే కాదు; భవిష్యత్తులో ఇటువంటి వీరాధి వీరు లెందరినో మనము సన్మానింప వలసియున్నది. బిరుదులు సన్మానములు పొందవచ్చును కాని, వాటిని పొందిన వారిపై తరువాత మరింత బాధ్యత పడునను సంగతి మరువరాదు. ఆ అర్హతను నిలబెట్టు కొనుటకు అంతకు ముందు కంటె ఎక్కువ కృషి చేయ వలసియున్నది. (సన్మానించును)

కోటయ్య: సర్దార్ పాపన్న నాయకుల వారు, మిత్రులు నొక్కి నొక్కి దేనిని గూర్చి వక్కాణించినారో నేను ప్రత్యేకించి చెప్పనవసరము లేదు. వారి హెచ్చరిక నాకు నైరంతర్య గుణ పాఠము. త్రాగుడన్నది తన ఒక్కనికే పరిమితము కాదు, తనకు సంబంధమున్న వారందరిపైన ఎంతో కొంత నష్ట ప్రభావ ముండి తీరును. నా సాహసమును గూర్చి నాయకుల వారు సైతము గ్గడించినారు. నిజానికి అది నా సహజ గుణము. వ్యసన బానిస నగుట కారణముగా మిత్రులు చెప్పినట్లు మరుగున పడి పోయినది. మన ఉద్యమమునకు నావిధి నేను నెరవేర్చితిని. పతాక ప్రతిష్ఠాపన ప్రథమత్వము లభించుట నా అదృష్టము. నాయకుల వారాదేశించినట్లు ఈ గౌరవార్హతను సదా కాపాడు కొందునని సవినయముగా విన్నవించు కొను చున్నాను.

తెలగన్న: చేసిన చెడ్డపని తిరిగి చేయక పోవడమే నిజమైన పశ్చాత్తాపము. కత్తి అంచుపై ప్రాణాలను పణంగా ఒడ్డిన కోటయ్యకు ఈ సత్కారము సభా సదులందరి అంగీకారముతో జరుగుట చాల సంతోషించ తగ్గ విషయము. సాహసంతో ఉద్యమించే వారిని విజయలక్ష్మి వరించి తీరు తుందనుటకు మన కోటయ్య విషయమే ప్రబలమైన ఉదాహరణము.

పాపన్న: ప్రస్తుతము ఖాళీగా ఉన్న కోశాధికారి పదవి యందు ఎవరినో ఒకరిని నియమించ వలసియున్నది. మిగుల విశ్వాస పాత్రుడు, సమర్థుడయిన అలీఖానును ఈ పదవి యందు నియోగించు చున్నాము.

తెలగన్న: సర్దార్ పాపన్న గారి హృదయమున కులమునకే గాక మతమునకు సరిహద్దులు లేవనుట కిదియే గుర్తు. నిజానికి ఏ వ్యక్తి నుండియైన కోర దగినవి నీతి నిజాయితీలు కాని కుల మతములు కావు. కుల మతములను బట్టి వ్యక్తుల వ్యక్తిత్వములను నిర్ణయించుట అవివేకము. మంచి పనికి మించిన పూజలేదు, మానవత్వానికి మించిన మతము లేదు. ఏ మత గమ్యమైన ఒక్కటే. అది సత్య సాక్షాత్కారము. శాంతి, సత్యాహింసలే మత ప్రబోధాల లక్ష్యము. కనుక మత భేదము లెన్నుట తెలివి తక్కువ తనము.

చం: గతము తలచు కొన్నయెడ కద్భది చెర్వగు చుండె నేమిటో
మత మను పేరుతో పనికి మాలిన భేదము లల్లి నార లే
మతమున కైన మూలములు మానవతా పరి పక్వ హేతు పం
త త బుత శాంత్యహింసలు కదా! ఇక నేటికి హెచ్చుతగ్గులున్

ఆలీఖాన్ మతాని కతీతుడుగా నీతిగా నిజాయితీగా బ్రతుకుచు మన ఉద్యమానికి తన జీవితాన్ని వినియోగించుచు సర్దార్ పాపన్నగారిపై అచంచలమైన ఆత్మ విశ్వాసము కలిగియున్న వ్యక్తి. అట్టి ఆలీఖాన్‌నకు కోశాగారాధ్యక్ష పదవి నొసంగుట సముచిత నిర్ణయము.

ఆలీఖాన్: సర్దార్ పాపన్నగారి ఆత్మ విశ్వాసమునకు ముగ్ధుడనై వారి అనుయాయులలో ఒకనిగా చేరిన వాడను నేను. నా కృషి వారి మన్ననలు పొందుట అదృష్టముగా భావించుకొనుచున్నాను. ఇక కుల మతముల లంటారా! ఇవి మనము కల్పించు కొన్న అడ్డుగోడలు. అసలు మా పూర్వులు హిందువులే. ఈ మతాల మార్పిడి కాల ప్రభావము. ఇప్పటికీ మా ఇళ్ళల్లో మాట్లాడు కొనేది సిసలైన తెలుగు. భవిష్యత్తులో ఇంకను మీ అందరి విశ్వాసమునకు పాత్రుడ నగుటకు ప్రయత్నింతును.

చం: మతము లబద్ధముల్ మనుజ మాత్రుల సృష్టియె దేవుడైన ఈ
కతమున ఐక్యమున్ విడిచి కత్తులు నూరుట కర్థ మేమి? ఉ
న్నత మగు నీతి బోధలు జనంబు మనంబుల కెక్కెవయ్యె, కు
త్సిత మగు వాని బట్టుకొని తెత్తురు కుత్తుక పైకి కత్తులన్

తెలగన్న: సోదరులార! ఆస్థాన పురోహితునిగా నేను చెప్ప వలసిన ముఖ్య విశేషమొకటి మిగిలియున్నది.

(అందరూ ఆశ్చర్యముతో తెలగన్న వంక జూతురు)

ఉద్యమాలు విజయవంత మగుటకు వ్యక్తి గత శక్తి సామర్థ్యముల కన్న ఏ కాగ్రత కార్య దీక్ష మూల కారణములు. శారీరక శక్తికి మానసిక శక్తికి సమన్వయము

కుదిరినప్పుడే ఏకాగ్రత లభించును. ఏకాగ్రతలో మన ధ్యేయం తప్ప ఇతర విషయాలు మన మనసునకు రాకూడదు. మనో నిగ్రహము లేని నాడు ఎన్ని విశిష్ట శక్తు లెంతగా నున్నను బూడిదలో పోసిన పన్నీరగును. ఆ ఏకాగ్రతను సాధించుటకే ఉద్యమ నాయకత్వ బాధ్యతను స్వీకరించిన సర్దార్ పాపన్న నాయకులవారు మనో నిగ్రహముతో వివాహమును మాను కొని యున్నారు. వారి వివాహమును గూర్చియే నాయీ ప్రస్తావన.

హనుమంతు: ఆ ముహూర్తము పండితులతో చర్చించి నిర్ణయించుట మంచిది.

ఆలీఖాన్: పెండ్లి కూతురెవరు?

హనుమంతు: పెండ్లి కూతురెవరా! ఆలీ గారు వరీ మీరు విచిత్రంగా మాట్లాడు తున్నారే!

తెలగన్న: ఇంకెవరండి? మన వసంతగారు. లోకము కోడై కూస్తుంటే మీకు తెలీదా!

వసంత: నా పంతం నెరవేర కుండగా నేను పెండ్లి చేసి కొనను.

ఆలీఖాన్: పంతం అంటే!

తెలగన్న: వసంతను పెండ్లి చేసి కొను వ్యక్తి ఎవరైనను కత్తి కలిపి నెగ్గ వలసినదే అని ఆమె పంతము.

వసంత: కం: ఇది నా అగ్రజ నిర్ణయ
మదిగాక పలువురు దీని నావేశముతో
ఎదిరించిన వారు గలరు
పదుగురిలో బడిన వెనుక బాధ్యత గాదే!

హనుమంతు : అది మన మందరము సామాన్యముగా బ్రతుకు చున్న రోజులలో తీసికొన్న నిర్ణయము. నేడు దానిని ప్రశ్నించు వారెవరు?

వసంత : మా అన్నగారి ఆత్మను క్షోభింప జేయుట నాకిష్టము లేదు.

పాపన్న : హనుమంతూ! నీ వట్లనుట సముంజసము కాదు. ఒకరికి ఒక ధర్మము, మరొకరికి ఇంకొక ధర్మము అనుట మన వంటి వారికి తగినది కాదు.

హనుమంతు : ప్రభూ! మీ శక్తి సామర్థ్యములను శంకించి మాత్ర మట్లన లేదు. ఒక స్త్రీతో యుద్ధము చేయుట ప్రభువుల వారి గౌరవమునకు....

పాపన్న : స్త్రీయైన నేమి? పురుషుడైన నేమి? అట్టి భేదము వలదు. స్త్రీల కున్న అవగాహన శక్తి పురుషుల కున్నదా! అది యును గాక విశిష్ట శక్తి సామర్థ్యము లున్న వారి యెడ ఇట్టి దురభిప్రాయములు పనికిరావు. తెలగన్నా! వసంతతో యుద్ధానికి త్వరలో ముహూర్తము నిర్ణయించు.

తెలగన్న: సముచితమైన నిర్ణయము. అట్లు గాకున్నచో ప్రభువుల శక్తి యుక్తులను ప్రజలు శంకించే ప్రమాద మున్నది.

(ఇంతలో భేరీ ధ్వనులు వినిపించును)

హనుమంతు | అలీఖాన్ | (ఇరువురు బయటకు వెళ్ళి పరుగున వచ్చి)

హనుమంతు : ప్రభూ! రుస్తుందిల్ ఖాన్ సైన్యాన్ని సమీకరించు కొని కోట చుట్టు ముట్టినాడు.

పాపన్న : అయితే పారిపోయిన నవాబు మరలా ఈ పాపన్న దెబ్బ రుచి చూడాలను కొంటున్నాడన్న మాట.

ఆలీఖాన్: ప్రభూ! ఫిరంగుల శబ్దాలు!

తెలగన్న: సైన్యాన్ని సమాయత్తం చేయాలి!

పాపన్న: సోదరులార! ఆశించిన ఫలం ప్రాప్తించే వరకు కృతనిశ్చయంతో తిరిగి తిరిగి ఉద్యమించాలి.

ఎప్పుడో ఒక్కప్పుడీ గూటిలో పిట్ట
తనకు తాబోవుట తప్పదయ్యె
బ్రతికి చచ్చుట కంటె పౌరుష మరణంబు
సర్వ విధాల శ్రేష్ఠంబు గాన
స్వాభిమాన కలిత స్వాతంత్ర్య సాధన
తర తరంబులకు చైతన్య మొసగ
ఉక్కు పిండాలైన ఉద్యమ వ్యక్తుల
ఉన్నతోద్యోగంబు నుట్టి పడగ
ఇంత వరకును మన మిట్టు లీన గాచి
చిట్ట చివరకు నక్క పాల్జేసి నట్లు
చేయ కుండగ ధైర్యంబు చిక్క బట్టి
కోట నైనను కాపాడు కొనగ వలయు

హనుమంతు: ప్రభూ! తాడో! పేడో! నేటితో తేల్చివేయాలి.

పాపన్న: హనుమంతూ! మన సైన్యాన్ని యుద్ధానికి సమాయత్తం గావించు. కోట ద్వారాల వద్ద గట్టి కాపలా ఏర్పాటు చేయి. శత్రు సైన్యం ఫిరంగులతో వచ్చింది కనుక మనము కోట వెలుపలకు వెళ్ళుట ఎంత మాత్రము శ్రేయస్కరము కాదు. మరియు బయటి వారిని లోపలకు వచ్చుటకు కాని లోపల వారిని బయటకు వెళ్ళుటకు కాని అవకాశమీయవద్దు.

హనుమంతు: చిత్తము ప్రభూ! తెలగన్నను సభా భవనము నందే కొంత సైన్యముతో నుంచుట మంచిదేమో!

పాపన్న: అవును. తెలగన్న! నీవు ఎప్పటి కప్పుడు యుద్ధ వార్తలు

తెలగన్న: అవిగో! దక్షిణ ప్రాకారము వద్ద ఫిరంగి ధ్వనులు జోరుగా వినబడు చున్నవి.

వసంత : అక్కడ ఉన్నది పాపన్నగారు గనుక ఫిరంగులైన, శతఘ్నులైన భయపడ వలసిన పనిలేదు.

తెలగన్న: మొత్తము మీద దక్షిణ ద్వారము వద్ద పోరు ఘోరముగా జరుగు చున్నది. కనుక నీవు కొంత సైన్యమును పాపన్న గారికి సహాయముగా తీసికొని వెళ్ళు.

వసంత : అలాగే! (నిష్క్రమించును)

తెలగన్న: అదిగో! పాపన్న దక్షిణ ప్రాకారముపై నుండి సైన్యాన్ని పురి గొలుపుచు చేస్తున్న సింహనాదము.

సర్దారు పాపన్న సమర రంగాన
కత్తి కందిన శత్రు కంఠాలనైన
ఒక్కొక్క వేటుతో ఒరగగాజేసి
చక చకా ముందుకు సాగుతుంటేను
వీరులు ధీరులు నోరెళ్ళ బెట్టి
ఏమియు పాల్పోక ఈక్షింప వలయు
సేనాధి పతులైన చెదరి పోవలయు
పాదుషాలైనను పరుగెత్త వలయు

ఆలీఖాన్ : తెలగన్నా! ఇంకేమున్నది! దక్షిణ ప్రాకారము వద్ద సర్దార్ పాపన్నగారు న్నారన్న సంగతి తెలిసికొన్న నవాబు తన సైన్యమును ఉత్తర ప్రాకారము పైకి ఉసి గొల్పినాడు. శతఘ్నులు అగ్ని వర్షం కురిపిస్తున్నప్పటికి మన ఉద్యమ వ్యక్తులు వెనుకడుగు వేయకుండగా ప్రాణాలకు తెగించి పోరాడు చున్నారు. కాని మన సైన్యం ఎక్కువ కాలం నిలబడే టట్లు లేదు.

తెలగన్న: అయితే నీవు కొంత సైన్యాన్ని తీసికొని త్వరగా వెళ్ళి ఉత్తర ప్రాకారమును రక్షించు. ఈ సంగతి సర్దార్ పాపన్న గారికి తెలియు జేస్తాను.

వసంత : (తిరిగి వచ్చి) దక్షిణ ప్రాకారము వద్ద కురిసిన ఫిరంగి గుళ్ళకు కోటయ్య ఆహుతై పోయాడు!

తెలగన్న: వీర హంవీరుడైన కోటయ్య ఫిరంగి గుండుకు ఆహుతై పోయాడా! సర్దార్ పాపన్న గారి కుడిభుజం తెగిపోయింది! ఎంత దారుణం జరిగి పోయింది! మిత్రుణ్ణి కోల్పోయాను!

వసంత : నవాబు సైన్యం ఉత్తర పడమరల ప్రాకారముల వద్ద కేంద్రీకరింప బడియుండుటచే సర్దార్ పాపన్న గారు కూడ అక్కడకే చేరినారు.

తెలగన్న: పాపన్న గారక్కడికే వెళ్లితే కోటకు ఏ అపాయము లేనట్లే!

ఆలీఖాన్: (తిరిగి వచ్చి) ఏదో కుట్ర జరిగింది! మన బందీ లందరు కారాగారము నుండి తప్పించుకొని పారి పోతున్నారు.

తెలగన్న: ఎంత మోసం!

వసంత : తెలగన్నా! నేను సర్దార్ పాపన్న గారికి సహాయముగా పోరాడుటకై వెళ్లుతున్నాను. చిట్ట చివరి నెత్తురు బొట్టు కూడ ఆయనకే అంకితమిస్తాను. (అని బయలు దేరబోవును)

ఆలీఖాన్: ఎవరి ఉప్పు పులుసు తిని, ఈ శరీరము పెరిగిందో వారికే దీన్ని సమర్పిస్తాను. అప్పుడే తృప్తి. ఈ జన్మకు సార్థక్యమదే. (అని బయలుదేరును)

తెలగన్న: నేను కూడ మీతోపాటే వస్తున్నాను - అదిగో ఫిరంగుల మోత ఎక్కువైనది. ఫిరంగులలో రాగి డబ్బులు వేసి, కొట్టుచున్నట్లునది. హాహా కారములు మిన్ను ముట్టుచున్నవి. ఉత్తర ప్రాకారము కూలిపోవు చున్నదే.

తే. గీ- కాలు డనువాడు నిత్యంబు గాచి యుండ
నెవ్వడిల నుట్టి గట్టి యూరేగ గలడు
పౌరుషంబు తాకటు పెట్టి బ్రతుక లేను
ఉద్యమంబున కర్పింతు నుసురునైన

తే. గీ- ప్రాణ ముడిపోవునపుడైన త్రాచు, పడగ
నెత్తి తీవ్ర కోపాన నాడించునట్లు
నా శరీర మందూపి రున్నంత వరకు
కత్తి కదలాడు కదన రంగంబు నందు.

(తెరపడును)

సర్వము సమాప్తము

కోటయ్య: అయితే నా ప్రమాణ మిదె.

ఉ: మీసము మీద నొట్టు, పులి మీసల నుయ్యెల లూగు శౌర్యవి
న్యాసము, కర్ర కత్తి మొదలైన పరాక్రమ విద్యలందున
భ్యాసము. స్వీయ బాహుబల భాగ్యము నందెన లేని యాత్మవి
శ్వాసము గల్గినట్టి మన పాపనికే బ్రతు కప్ప జెప్పెదన్

హనుమంతు: మిత్రులార! నా ప్రమాణమును గూడ వినుండు.

శా: పాపన్నా! భవదీయ సవ్యజనతా వాల్లభ్య సంపాదనై
త్సాహోద్యమ కార్యరంగమును నాయుల్లంబులో దల్పగా
ఆపాదాంత శరీర మూగు నిపుడే. హర్షోద్ధతుల్ కల్గగన్
నీ పాదంబుల సాక్షిగా నడచెదన్ వెన్నంటుచున్ నీడనై

లగన్న: మీ ప్రమాణంబులు మిక్కిలి సమంజస రంజితముగా
నున్నవి. నాకు మీ కున్నటు వంటి ధైర్య సాహసములు
లేకపోవచ్చు గాక! కాని నా ప్రమాణమిది.

ఉ: నేనిక నేటినుండి జననీ జనకాదుల సాక్షి, నాదువి
జ్ఞానము సర్వమున్ దమకు కానుకగా వెలయింపజేసి నా
ప్రాణము సైతమున్ విడువ వచ్చెడి కష్టము సంభవించినన్
గానము జేయువాడ కవిగా భవదీయ పరాక్రమాదులన్

పాపన్న: నాయందింత గౌరవము ప్రకటించిన మీ అందరకు అభి
నందన పూర్వాభివందనములు. నాపై నుంచిన మీ విశ్వాస
భారమును వంచనా శిల్పమునకు తావీయకుండగా
వహించి మన ఉద్యమమును నడిపింతునని చేయుచున్న
ప్రమాణమిదె.

ఉ : సోదరులార! మీరు పరిశుద్ధ మనస్సుల తోడ నిత్యశౌ
ర్యోదయ వృత్తియైన మన యుద్యమమున్ నడిపించు కార్యభా
రాదుల మోపి నాపయిని అంకిత భావ మెలర్ప నుండగా
కాదన మంచిదే? ప్రజల కష్టములన్ గడతేర్ప కుందునే!

(అందరు చప్పట్లు కొట్టుదురు)

రేపటి నుండియే ధన జన సమీకరణంబు గావించుటలో మన మందరము నిమగ్నులము కావలిసి యున్నది. అంతే కాదు, మనము నేటి నుండి గుర్తుంచుకొన వలసిన విషయములు కొన్ని యున్నవి.

లోకములో సర్వానర్థములకు కామము బీజ మయితే దానికి కీసవెలితి తాగుడు. కనుక ఈ వ్యసనములకు దూరముగా నున్నప్పుడే మనము గమ్యమునకు చేరుకొన గలము. మన వ్యసనాలే మనకు దారుణ శత్రువులు. అందుచే

ఉ : స్త్రీలను ముట్టరాదు, మన చేతుల మద్యము తాకరాదు, మో
సాలను జేయరాదు, పరుసందనమున్ వహియింపరాదు, లం
చాలను బట్టరాదు, జన జాగరణంబె బ్రధాన కార్యమై
వీలును బట్టి తొందరగ వీరుల వోలె తయారు కావలెన్.

(అందరూ పాపన్న వెంట దీనిని పలుకుదురు)

హనుమంతు : ప్రొద్దు వాటారు చున్నది. కోటయ్యా! పైడప్పా! మీరిరువురు వెళ్ళి పశువుల మందల్ని మళ్ళించండి. ఈ వేళకే ఈ సంబంధము. రేపటి నుండి వాటికి మనకు ఋణము తీరిపోయినట్లే. మన స్థానములో జీత భత్యాలిచ్చి కొందరిని నియమించవలసి యున్నది.